శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక

కాకినాడ.

రెండునెలల కొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౧. { చిత్రభాను. మార్గశిర—ఫాల్గుణములు. } సంచిక ౫-౬.





కాకినాడ:

పరిషత్కార్యాలయమునఁ బ్రకటింపఁబడినది.

చందా, పోష్టువ్యయములతో సంవత్సరమునకు రు 3-0-0.

1942—43 డిశంబరు-మార్చి.

# విషయసూచిక.



ముద్రణమునకు సకాలములో కాగితము లభింపకపోవుటచే నీసంచికను ప్రకటించుట యాలస్యమైనది. పాఠకులు క్షమింతురుగాక.

సంపాదకుడు.

శ్రీ

# ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక.

## కాకినాడ.

రెండునెలలకొకసారి ప్రకటింపఁబడును.

(Journal of the Telugu Academy.)

సంపుటము ౩౧. { **చిత్రభాను.** మార్గశిర—ఫాల్గుణములు. } సంచిక ౫-౬.

# భువనవిజయప్రశంస.

**వి. రామసుబ్బారాయఁడు.**

సీ. నినుఁ జెప్పి యావల నినుఁ జెప్పవలెఁగాదె
ప్రకటప్రతాపసంపత్తియందు
నినుఁ జెప్పి వెనుక నింద్రునిఁ జెప్పవలెఁగాదె
యతులితభోగభాగ్యంబులందు
నినుఁ జెప్పి పిదపఁ జంద్రునిఁ జెప్పవలెఁగాదె
భవ్యప్రసాదవైభవమునందు
నినుఁ జెప్పి మఱియుఁ గామునిఁ జెప్పవలెఁగాదెఁ
యిద్ధసౌందర్యసమృద్ధియందు

గీ. నిన్నుఁ జెప్పినవెనుకనే నిక్కముగను
జెప్పవలెఁగాదె కర్ణుని శిబినిఁ గామ
ధేనువును గల్పకంబును దానమందు
దీప్తిధారేయ ! శ్రీకృష్ణదేవరాయ !

గీ. రాజరాజనరేంద్రుండు భోజనృపతి
మున్నుగాఁ గలకవిరాజభూపకోటి
యాంధ్రగీర్వాణజగతిలో నగ్రగణ్యు
లైనఁ, గృష్ణరాయలకీర్తి యధికమయ్యె. 2

గీ. తాను గవియౌటఁ గవుల నాస్థానమందుఁ
జేర్చి తగురీతి వారిఁ బోషించుచుండె
సత్కళావృద్ధి దేశదేశముల కెక్కె
నిట్లు చేయుంత నిచ్చువా రెందుఁ గలరు ? 3

గీ. అష్టదిగ్గజములతోడ నలరుచుండి
తెలుఁగుకళ కెంతయైనను వెలుఁగుఁ జూపి
కవుల కేలాటిలోపంబుఁ గలుగకుండఁ
గంటి కల రెప్పరీతిగఁ గాచియుండె. 4

గీ. తెలుఁగులోఁ బుట్టి పెంఁగినదివ్యమూర్తి
కానఁ దెలుఁగుకవుల కెల్లఁ బ్రాణ మగుచుఁ
గవులదారిద్ర్యమును బాపి; కవిని సర్వ
లోకకల్యాణమూర్తిగా సాఁకుచుండె. 5

గీ. ముక్కుతిమ్మకవీంద్రుని ముద్దుపలుకు
అల్లసానికవీంద్రుని యల్లికబిగి
భట్టుమూర్తి కవీంద్రుని ప్రౌఢశైలి
యష్టదిగ్గజమందుఁ బేరంద నయ్యె. 6

గీ. కృష్ణదేవరాయలదివ్యకీర్తి కృష్ణ
దేవరాయలగంభీరభావగుణము
కృష్ణదేవరాయలతెన్గుతృష్ణ తనివి
తీఱ వర్ణించి పెద్దన్న తృప్తిఁ జెందె. 7

గీ. "కృష్ణరాయలతో దివి కేఁగలేక
వసుధఁ బ్రతికితి జీవచ్ఛవంబ నగుచు"

ననుచు వ్రాసికొన్నట్టి పెద్దన్నఘనత
చెప్ప నేటికిఁ గ్రొత్తఁగాఁజేసి నేఁడు. 8

ఉ. "నాలుఁగుమోములన్ నిగమనాదము లుప్పతిలన్ ప్రచండవా
తూలహతిన్ జనించురొదతోడ గుహావళి నొప్పుమేరువుం
బోలి పయోజపీఠమునిముఖ్యులు గొల్వఁగ వాణిఁ గూడి పే
రోలగమున్న ధాత విభవోజ్జ్వలుఁ జేయుతఁ గృష్ణరాయనిన్." 9

మ. అని కీర్తించి రసాన్నభోజనముచే నైశ్వర్యసంపత్తిచే
ఘనసత్కారశుభోన్నతాకృతులచేఁ గల్యాణభోగంబుచేఁ
దనరెన్ బెద్దనమేటిసత్కవులకున్ దా తోచు శ్రీకృష్ణరా
యనికిన్ బెద్దన తెచ్చెఁ గీర్తి యనువాక్యం బిట్టు శ్లాఘ్యం బగున్. 10

గీ. ఆంధ్రకవితాపితామహుఁ డన్నబిరుదు
కృష్ణరాయలు పెద్దన్న కిచ్చె ననినఁ
గృష్ణరాయలకీర్తి కీర్తింప నౌనె?
యుభయులునుగూడ ధన్యు లీయుర్విలోన. 11

గీ అఖిలఛందమ్ములందు గాయత్రివోలె
నక్షరంబుల నోంకార మట్టులఁ గావ్య
రసములందున శృంగారరసమురీతిఁ
బ్రథితకావ్యాళి మనుచరిత్రంబు ఘనము. 12

గీ. పారిజాతాపహరణంబు వ్రాసి ముక్కు
తిమ్మనార్యుండుఁగూడఁ గీర్తికళ లందె
నాంధ్రకావ్యంబులందు నత్యంతఘనము
పారిజాతంబు సమ్మోద భరిత మగుట. 13

ఉ. ముద్దులుమూటఁగట్టురసమున్ గురిపించుచు మాటిమాటికిన్
ముద్దులుముచ్చటల్ గొలుపుపోకడ లెల్ల రచింపనేర్పునీ
సుద్దులు వర్ణనీయములు సూరిజనంబుల కెల్లఁ దేనెలో
నద్దితివో కలంబు కలు కంతటితీపినిఁ గాంచఁ దిమ్మనా! 14

గీ. కొండలన్నింట బంగారుకొండవోలె
దంతిగణమున నైరావతంబుభాతిఁ
దరువు లన్నింటఁ బారిజాతంబురీతిఁ
బారిజాతంబు ఘనము కావ్యంబులందు. 15

గీ. మనుచరిత్రకావ్యంబున ఘనము గాఁగఁ
బారిజాతకావ్యంబునఁ బ్రౌఢి కెక్కఁ
గృష్ణరాయలకీర్తి కీర్తించికాదె
పెద్దనార్యుఁడు తిమ్మన్న పెద్ద లైరి. 16

ఉ. భట్టుకవీంద్రుఁ డన్న రసవర్ణన కెక్కుడుకైతకొమ్మఁ జే
పట్టినదిట్టు; శివపదవర్ణనఁ గూర్చుటయందుఁ గాంక్షయున్
గట్టిగఁ గాంచినట్టికవికాంతుఁడు; శ్రీయుత తిర్మలేంద్రస
మ్రాట్టునిఁ గొల్చి వైభవవిరాజితుఁ డయ్యె నఖండశేముషిన్. 17

ఉ. పింగళి సూరనార్యునివివేకముసొంపు కళాప్రపూర్ణకా
వ్యాంగనయందుఁ గన్పడుమహత్తరకల్పనఁ జేయుపట్ల వే
భంగుల మించు సాటికవివర్గము నెల్లఁ దెలుంగుభూమిలోఁ
బొంగినమొక్క పుష్పఫలమూలము మాటలు వేయు నేటికిన్. 18

ఉ. నిం డగువేడ్కలన్ బలుక నేర్చినయయ్యలరాజరామభ
ద్రుం డసమానకీర్తిఁ దులతూఁగినవాఁడు కవిత్వమందు ను
ద్దండపదప్రయోగములఁ దన్ప్రవీణతఁ జూపఁ జాలు శూ
రుండు; సుధారసార్థములు గ్రోలఁగ నా సుకవీంద్రపాళికిన్. 19

ఉ. తిక్కనవోలె వ్రాయఁగలధీరుఁడు తేటతెనుంగుమాటలన్
జక్కనిపోకడల్ తెలుపఁ జాలినధూర్జటి తెన్గుతల్లికిన్
జిక్కనభాగ్యశాలి విరచించినగ్రంథ మొకండె యైన స
మ్యక్కళలన్ విరాజిలుఁగదా కవికోటికిఁ గంఠహారమై. 20

ఉ. మాదయగారిమల్లన సమర్థుఁడు తెన్గుకవిత్వభూమిలోఁ
బాదులు పాదుగొల్పి రసవర్ణన కెక్కఁగఁ బెంచినాఁడు స

మ్మోదము గూర్చునాకవనముఁ బుధులెల్లగు మెచ్చురీతి వి
ద్యాదయుతుం డతండు వసుధన్ గృతకృత్యుఁడు పెక్కులేటికిన్. 21

సీ. రాజశేఖరచరితంబు రాణమిగులుఁ
గవితయందును మేటిపోకడలయందుఁ
బలుకుపలుకున నమృతంబుఁ జిలుకుచుండె
రసికశేఖరకోటికి శ్రావ్యమద్ది. 22

గీ. ప్రథితశ్రీనాథకవిసార్వభౌముపోలె
సీసపద్యంబు లెల్లను వ్రాసి మించె
నాంధ్రవాఙ్మయారామంబునందు శ్లాఘ
నీయ మారాజశేఖరునిచరితంబు. 23

గీ. పాండురంగమాహాత్మ్యంబు వర్ణనకును
మించఁ జాలినగ్రంథ మం చెంచవలదె?
రామకృష్ణుని యుద్భటారాధ్యచరిత
ప్రౌఢకవితకు మేటితార్కాణమగును. 24

ఉ. "వాసన లేనిపూవు రసవర్ణన లేనికవిత్వరేఖ య
భ్యాసము లేనివిద్య జలజాప్తుఁడు లేనిదినంబు చంద్రికో
ల్లాసము లేనిరాత్రి కమలస్థితి లేనికొలంకు చూవె కై
లాసనివాసునాత్మను దలంపనిమూఢులజన్మ మారయన్." 25

ఉ. ఇట్టి మహోన్నతాశయము లిట్టిప్రబోధము లిట్టితత్త్వమె
ప్పట్టున నిట్టినీతిగుణవాక్యము లిట్టివిరాగమార్గ మిం
కిట్టిసురార్చనావిధుల నెంతయు సెప్పెడి రామకృష్ణుఁడే
గట్టికవీశ్వరుం డనినఁ గాదనువాద మొకండు గల్గునే? 26

ఉ. ఎట్టితపంబుఁ జేసిరొకొ యెట్టిజపంబుల నాచరించిరో
యెట్టి విశేషసత్కృతుల నేర్పడఁ జేసినవారొ తొల్లి స
మ్రాట్టుని సత్కవీశ్వరుని మాన్యుని శ్రీయుతకృష్ణరాయనిన్
నెట్టనఁ గొల్చుభాగ్య మవనీతల మందునఁ గాంచి మించిరే? 27

గీ. కృష్ణరాయల కొకసాటి యొకఁడు లేఁడు
కృష్ణరాయల మించువా రెవరు లేరు
కృష్ణరాయలు భూలోకకృష్ణుఁ డంచు
వర్ణనలు జేయుకవితయుఁ బావనంబు. 28

ఉ. రాయలనాఁటి సత్కవులప్రాభవ మెంచినయంతలోన నా
రాయనిపించు నాఁటికవిరాజులసత్కృతు లెంచినంత నా
రాయనిపించు రాజకవిరాజులబాంధవ మెంచినంత నా
రాయనిపించుఁ గృష్ణకవిరాయలభాగ్యమె భాగ్య మెన్నఁగన్. 29

గీ. రుద్రగణములలో శంకరుండువోలె
గ్రహములందున భాస్కరగ్రహమురీతి
మేటిఋషికోటియందు వాల్మీకిపగిది
నృపులలోఁ గృష్ణరాయలు నియతిఁ గాంచు. 30

గీ. రాజభక్తిభావంబులు ప్రబలునట్లు
పూర్వకవికృతకావ్యసంబోసఁగుచుండుఁ
గావ్యమున కలంకారంబుఁ గాఁగ నందు
దేవతారాధనాసక్తి తేజరిల్లు. 31

గీ. కవులపాలిఁట స్వర్ణయుగంబు గాఁగ
నాఁటికవిరాజరాజబాంధవ్య మెంచు
పట్లు నొండొరులకుఁ గల్గు భక్తిభావ
మిట్టిదంచు వర్ణింపలే రెవ్వరైన. 32

గీ. అష్టదిగ్గజముల మించునట్టికైత
వ్రాయఁ గలవార లీనాఁటిభరతభూమి
వెలసినా రన్నచో నేమిఫలము గల్గు
కృష్ణరాయలు లేనట్టిపృథ్వియందు. 33

# శ్రీనాథుని కవిత్వతత్త్వము.

కుందూరి ఈశ్వరదత్తు బి. ఏ.

శ్రీనాథునికవిత్వతత్త్వమునుగూర్చి యిదివఱకు నాలుగు వ్యాసములు 'ఆంధ్రి' పత్త్రికలో వ్రాసియున్నాను.

"హరచూడా హరిణాంకవక్రత"యొక్క భావ మెట్టిదో నిరూపించితిని. వర్ణవిన్యాస, పర్యాయపద, రూఢివక్రోక్తులకు లక్షణములును, లక్ష్యములును జెప్పితిని. ఈ వ్యాసములో మఱికొన్నిటి వక్రోక్తులను గూర్చి ప్రశంసించెదను.

కారకవక్రత.

శ్లో. యత్ర కారకసామాన్యం ప్రాధాన్యేన నిబధ్యతే।
తత్త్వాద్యారోపణా న్ముఖ్యగుణభావాభిధానతః॥
పరిపోషయితుం కాంచిద్భంగీభణితిరమ్యతాం।
కారకాణాం విపర్యాసః సోక్తా కారకవక్రతా॥

అచేతనము లగుపదార్థములకు చేతనసంభవిస్వాతంత్ర్యసమర్పణాదులవలన,అముఖ్యము లగు కరణాదులకుఁ గర్తృత్వాద్యారోపణము, కర్తకుఁ గరణత్వాద్యారోపణమువలన కారకవిపర్యాసము సంపాద్యమైనచో నది కారకవక్రత యగును. శ్రీనాథుని కవితనుండి కొన్నియుదాహరణము లిచ్చెదను.

తే. గీ. అని శపింపఁగఁ బూనునయ్యవసరమున
నేమి చెప్పుదు నోసంయమీంద్రవంద్య
యుదిలగొని కంప మందుచు నుండెఁగాని
శాపజల మందుకోఁ గేలు సాఁగ దయ్యె.

భీమఖండము. 2.109.

గీ. ఏమి సేయుదు ? నెక్కడి కేఁగువాఁడ ?
ధనము నిప్పచ్చరంబు విద్యయు హుళిక్కి

పెట్టసాఁగెదునాచేయి భిక్షసేయ
నెట్టునేరుచు? దైవంబ యెఱుఁగు నింక.

కాశీఖండము. 4-111.

పై పద్యములలోఁ నధోరేఖాంకితము లగువాక్యములలోఁ గరణమునకుఁ గర్తృత్వాధ్యారోపణము గావింపఁబడుటవల్ల విచ్ఛిత్త్యుక్తి యేర్పడి, కారకవక్రోక్తిని గవి కల్పించెను.

సంవృతివక్రత.

శ్లో. యత్ర సంవ్రియతే వస్తు వైచిత్ర్యస్య వివక్షయా।
సర్వనామాదిభిః కైశ్చిత్ సోక్తా సంవృతివక్రతా॥

వైచిత్ర్యవివక్షచే నెక్కడఁ బదార్థము సర్వనామశబ్దములచేత సంవృత మగునో, యచ్చట సంవృతివక్రత యేర్పడును.

ఈ క్రింది యుదాహరణములు గమనింపుఁడు.

ఉ. "ఎంచి నుతింప శక్యమె యహీశ్వరునంతటివాని కైన"

హరవిలాసము. 5-22.

గీ. "అనిన నే నేర్తు నయ్య యిట్టియంతవారు
కోరి కూర్చుండ నమృతంబుఁ గుడువఁబెట్ట"

హరవిలాసము. 6-114.

క. ఏమి శకునమునఁ జొచ్చితి
మో! మన్మథదమనువీడు... భీమఖండము. 2-96.

క. ఏమి యని చెప్పుదును, లో
పాముద్రా ప్రాణనాథ ప్రజ్ఞావిభవం
బేమో యయి చెడిపోవఁగ... భీమఖండము. 2-104.

గీ. "భిక్ష లే దని యింతకోపింతు రయ్య!"

భీమఖండము. 2-114.

శా. ఊఁకోఁ జెప్పఁగ నెంతయేని తడ వౌ నో విప్రశార్దూల"

కాశీఖండము. 7-174.

శ్రీనాథుఁ డీసంవృతివక్రోక్తిని బహువారములు రచించి, కవిత్వమునకు రామణీయకము నొడఁగూర్చెను. అధోరేఖాంకితములగు సర్వనామప్రయోగములచే స్వాతిశయ మైనవస్తువును వర్ణించుటయం దతిశయము కలదు.

ఉపచారవక్రత.

శ్లో. యత్ర దూరాంతరేఽన్యస్మా త్సామాన్య ముపచర్యతే।
తేశేనాపి భవత్ కాంచి ద్వక్తు ముద్రిక్తవృత్తితాం॥
యన్మూలా సరసోల్లేఖా రూపకాది రలంకృతిః।
ఉపచారప్రధానాసా వక్రతా కాచి దుచ్యతే॥

అత్యంతభిన్నము లగుప్రస్తుతాప్రస్తుతములకు సాతిశయపరిస్పందత్వమును ప్రతిపాదించునిమిత్తము సామాన్యధర్మము నారోపింపఁజేసిన చో నుపచారవక్రత యేర్పడును. ప్రస్తుతాప్రస్తుతములకు సాధర్మ్యసంబంధముచేత నభేదారోపమును జేసిన నైనను బైవక్రోక్తి సిద్ధించును. కొన్ని యుదాహరణము లిత్తును.

మ... "భానుకిరణంబు ల్గ్రాఁచినీకుంఁడటం,
బవలుం బర్వె మహాంధకారములు పైపై సూచినిర్భేద్యముల్.
శివరాత్రిమహాత్మ్యము. 1-84.

పై పద్యములో వర్ణింపఁబడినయంధకార మమూర్త మైనను, ఆవస్తువునకు ఘనత్వ మారోపించి సూచీనిర్భేద్య ముపచరింపఁబడెను. ఇట్టి ఉపచారవక్రతకు శ్రీనాథునికవిత్వము పెన్నిధి. శృంగారనైషధములోని ఆదికవిస్తుతి, కృతిపతిప్రశంసాపద్యము లుదాహరించెదను—

సీ. వ్యాసవాల్మీకి సంయమివాక్సుధాంభోధి
లోలోర్మిపంక్తుల నోలలాడి
... ... ... ... ... ... ... ... ... ... ... 1

సీ. తనకృపాణము సముద్ధతవైరిశుద్ధాంత
తాటంకముల కెగ్గు దలఁచుచుండ. 2

సీ. గగనకల్లోలినీకల్లోలమాలికా
వాల్లీసకములతో నవఘళించి. 3

అల్లే యీ క్రిందిభీమఖండమునందలి పద్యము.

సీ. కామకేటికల్యాణ కమలషండంబుల
సౌరభ్యభారంబు సంతరించి. 4

పై పద్యములలో వర్ణింపఁబడిన వస్తువు లచేతనము లైనను, వానికిఁ జేతనచమత్కారిత్వ మారోపించి, మనోహరముగా నుపచారవక్రోక్తిని గవి కూర్చినాఁడు.

లింగవక్రత.

శ్లో. భిన్నయో ర్లింగయో ర్యస్యాం సామానాధికరణ్యతః ।
కాపి శోభా భ్యుదే త్యేషా లింగవైచిత్ర్యవక్రతా ॥
సతి లింగాంతరే యత్ర స్త్రీలింగేచ ప్రయుజ్యతే ।
శోభానిష్పత్తయే యస్మా న్నామైవ స్త్రీతిపేశలం ॥

ప్రస్తుతచ్ఛాయాతిశయమునిమిత్తము స్త్రీలింగపదములనే వాడుట లింగవైచిత్ర్యవక్రత. స్త్రీ యనునభిధానమే హృదయహారిగదా! శ్రీనాథుఁడు దీర్ఘాంతములగు సౌకుమార్యము లైనపదములను పద్యముల నేర్చి కూర్చినాఁడు, చూడుఁడు.

"వేశవాటీకుటీమధ్యవీథులందు"

హరవిలాసము. 5-8.

"ప్రాలేయాహిత సంప్రదీప్తకిరణప్రక్రీడదర్కోపల
జ్వాలాజ్వాలజటాలజాంగలతటీవాచాలకోయష్టియై"

హరవిలాసము. 7-109.

"..............................సవిధస్వర్లోకకల్లోలినీ
గంభీరాంబుతరంగసంభ్రమములం గల్యాణవాతూలముల్"

హరవిలాసము. 7-114.

"……………దిక్కామినీ
కాంచీ మౌక్తికకీర్తి…"　　శృం. నైషధము. 1-10.

"…………యశఃకల్లోలినీవల్లభుఁ."　　భీమఖండము. 1-39.

"…………భూపాల లీలావతీ
భ్రూవల్లీనిభశృంగకంబగు…"　　భీమఖండము. 1-36.

"వార్ధులేడింటికి వలపువనితయైన
మంగళోత్సంగ గౌతమీ గంగ యెదుర"　　భీమఖండము. 3-22.

"ఫలినీ వల్లిమతల్లివల్లరులపై"
"తాంబూలీ దళభాగపూరితముఖుల్."
శివరాత్రిమహాత్మ్యము. 4-19; 23,

"భాగీరథీగంగ"
"కాశీక్షేత్రము"　　కాశీఖండము. 2-53, 2-113.

మ. "నిజమేఁ బల్కెద బాహువెత్తి శ్రుతివాణీహృన్మనోపతి
ధ్వజకుంభీశగణేశ్వరుల్ గుఱిగ నో వారాణసీదేవి!
కాశీఖండము. 2-136.

"………………కాశీపురీవాహినీ
త్రయవేణీ పులినంబులందు"　　కాశీఖండము. 6-273.

శ్రీనాథుని మనోరంజక మగుకవిత్వమునకుఁ గారణంబులలో నొకటి యీ స్త్రీలింగపదములకూర్పే! అతని పాండిత్యము, ప్రతిభ, యీ పదములకూర్పువల్ల విశదము కాఁగలదు. గ్రంథవిస్తరభీతిచే సంగ్రహముగ నీ విషయమును దెలిపి విరమించుచున్నాను.

ఇంకొక వ్యాసమునందు శ్రీనాథుని క్రియావక్రత, సంఖ్యా, పురుష, వక్రతలు, ప్రకరణ ప్రబంధవక్రతలనుగూర్చి కొన్నిసంగతులను దెలిపెదను.

(సశేషము)

# తెలుఁగుతీపి.

**విద్వాన్, పాలెపు వేంకటరత్నం.**

శా. అమ్మా! కావ్యసరస్వతీ! ప్రవిమలాహ్లాదైకసాహిత్యభా
గ్యమ్ముల్ నాకిడి భావవీచికలతో గంభీరశబ్దాళితో
నెమ్మిన్ వ్యంగ్యనిగాఢజీవనసమన్వీతాంధ్రకావ్యాబ్ధి ని
త్యమ్మున్ ద్రచ్చెడుశక్తి మాకొసఁగ రమ్మా! నీకుఁగే లోడ్చెదన్. ౧

సీ. ఆమ్రకిసాలఖాద్యానందమునఁ జొక్కి
కూయదా? గొంతెత్తి కోకిలంబు
కుసుమాసవాస్వాదకుతుకిత మై వేడ్క
పాడదా! సుఖముగా బంభరమ్ము
ఫలరసామేయసంపదఁ గొల్లఁగొని కీరి
పలుకదా? కిలకిలఁ జిలుకకొదమ
ప్రథమవార్షికబిందుపానతృప్తిని గేరి
సంతస మందదా? చాతకంబు.
భారతీపదమంజీరభవ్యనాద
జనితకమనీయవాగ్గీతి ననువుపఱుచు
కావ్యనందనవిహారణాఖండసుఖము
ననుభవించి సత్కవి మోద మందఁ డొక్కొ? ౨

సీ. ఏ తాటియాకుపై నింపుగాఁ గేతన
దశకుమారులచరిత్ర నవినాఁడొ?
ఏ కుటీరస్థుఁడై యెలమితో మంచన
కేయూరబాహుని గీర్తిసేసె!
ఏ గంటమునఁ దేనె లేపారఁ జక్కన
విక్రమార్కచరిత్ర విరచినాఁడొ
ఏ యాముదపుదివ్వె యించుక వెలుఁగఁగా
పోతన కావ్యసంపూర్తిఁ జేసె!
ఆపరికరావళులును దివ్యస్థలములు
పావనము లయి ప్రాజ్ఞసంభావ్యము లయి
కవిమనోగేహనవదీపకళిక లగుచుఁ
**బొలుపు నింపును గాదె సంపూర్ణశక్తి.** 3

మ. కుడిచెన్ బంగరుపాత్రికన్ నృపులతోఁ గూర్మిన్, సభాశాలలోఁ
బడసెన్ బంగరుపూలవాసల శిరోభాగంబునన్, వేశ్యతో
ముడిచెన్ బంగరువల్వలాభరణముల్ భూజాను లర్పింప నీ
కడకన్నుల్ దనుఁ గ్రమ్మునాఁడు కవిరాడ్గంధేభ మీ భారతీ ౪

చ. విజయవిలాసమున్ రసవివేకముతోడ గ్రహించి చాలయ
క్కజ మగు పారిజాతహృతికావ్యపురీతుల నిచ్చ మెచ్చి యం
బుజముఖలఁ దేటు లట్లు వసుధావరుకబ్బపుతీపి గ్రోలుచున్
సుజను లమర్త్యసౌఖ్యములఁ జూరలు గొందురుగాదెనిచ్చలున్

శా. వాణీకోమలపాదనూపురవిరావస్వచ్ఛశబ్దంబులో?
పాణిస్థాములవల్లకీమృదులనిక్వాణంబులో! సర్వగీ
ర్వాణానందవిలాసనాట్యకలనాప్రారంభగానంబో? వి
న్నాణం బొప్పెడు దెల్గుకైసరులయానందోక్తిజాలం బొకో! ౬

ఉ. కొందఱు రాజపుంగవు లకుంఠితకావ్యరసాపగల్ సుధా
స్యందిమృదూక్తిమాధురుల నాదర మొప్ప వెలార్చి రట్టివా
రందఱకీర్తిచంద్రిక లసంతదిశాంతవిచుంబితంబు లా
నందకళాప్రపూర్ణరచనన్ వెలువారిన వాంధ్రభూస్థలిన్. ౭

చ. తరుణశిరీషకోమల సుధామధురోక్తులఁ బల్కు; పాలవే
కరికదిరీపతీందుఁ డతిక్రమకథాకళికల్ వెలంగ ని
ర్ఝరసమవేగయుక్తశుకసప్తతికావ్యము దానిచాతురీ
గరిమ గ్రహించు భాగ్య మది గల్గినవారలు ధన్యులే గదా? ౮

చ. సముఖముకృష్ణనాయకుని చాటుతరోక్తులు గాంగనిర్ఝరీ
సమములు తంజపట్టణవిశాంపతియౌ రఘునాథుజిహ్వికా
గ్రమ్మృదులవాక్సుమావళి యఖండపరీమళమోదదాయియై
గమగమలాడె వారలయఖండితశక్తుల కంజలింపరే. ౯

మ. కవితాభ్రమ్మున క్రమకూజితములన్ గానమ్ము సాగించి భా
వవిభూషల్ పదపల్లవంబుల రసాస్వాదైకహృద్యమ్ముగా
నవనీతాధికమార్దవంబు నమృతానందంబుఁ జేకూర్చు నీ
కవిపుంస్కోకిలగానమాధురుల వేడ్కం గ్రోలు మోసోదరా.

## ౫. 'మహాకవిప్రయోగసాధనము—మహాభాష్యశక్తి.'

వ్యా.వి.ప్ర.ఉ.భా.ప్ర. పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రి.

---

"తపసః పరస్మైపదం చ'—తపసః పరస్మైపదంచేతి వక్తవ్యమ్. తపశ్చరతి-తపస్యతి. కథమ్,—'తపస్యతే లోకజిగీషురగ్నేః, ఛాందసత్వాద్భవిష్యతి" (మహాభాష్యము. ౩ ౧. ౨. ౧౫.)

ఈమహాభాష్యము నుదాహరించి శ్రీశాస్త్రిగా రిట్లు వ్రాయుచున్నారు. "పైని జూపినభాష్యములోని భారతరామాయణాదిప్రయోగసాధనశక్తి సరయునపుడు పాణినీయము భారతరామాయణాదిప్రయోగానుశాసకము కా దనువిపరీతనిశ్చయము కల్గక మానదుగదా!"

(అనుబంధము-౫, ౬. పా.)

పాణినీయమునుబట్టి సాధువు లని మహాభాష్యకర్త సాధించిన మహాకావ్యప్రయోగము లనేకములు (భారతి. ౧౮-౩౭ లోని) నావ్యాసమున నుదాహరింపఁబడినవి. అం దొకదాని నైనను శ్రీశాస్త్రిగారు పాఠకలోకమునకుఁ జూపింపక యతఁ డసాధు వని త్రోసిపుచ్చినయొక యార్షప్రయోగమునుమాత్ర మీయనుబంధమున నుదాహరించి మహాకవి ప్రయోగముల సాధించినమహాభాష్యశక్తి యిట్టిదియే యని పాఠకులకుఁ 'బాణినీయము కావ్యభాషానుశాసకము కా'దనువిపరీతనిశ్చయమొకదానిని గలిగింపఁ జూచిరి. ఈవ్రాఁత లెంతవఱకు సత్యములో పరిశోధింతము.

పెద్దలయెడ నితరులయెడకంటె గౌరవబుద్ధిని సర్వవిషయములందును బ్రకటించుచుండుట లోకాచారము. ఆచార్యుఁడు వచ్చె ననుటకు బదులుగా నాచార్యులవారు వచ్చి రందుము. ఇట్లే యితరవ్యవహారములందును నితరులయెడకంటె విలక్షణముగాఁ బెద్దలను మనము గౌరవించుచుండుట లోకజ్ఞు లెఱుఁగనిది కాదు. అట్టివా రేవిషయముననైనఁ బ్రమాదపడినప్పు డది ప్రమాద మనుటకు బదులుగా నాలోచింపుఁ డనియో లేక మఱియొకరీతినో మన మనుచున్నాము. ప్రతివాదిమతఖండనమునఁ

గూడఁ బరవాదము దుర్బల మని నిరూపించియు, 'చిన్త్య' మనియో 'విచార్య'మనియో వ్యాఖ్యాతల నుచుందురు. శాస్త్రములలో బహుళముగా నిట్లే కానవచ్చును. అట్లే పతంజలిభగవానుఁడును, శాస్త్రకర్తలు మహాకావ్యకర్తలును బ్రమాదపడినప్పుడు 'ఛాన్దసత్వాద్భవిష్యతి' అనుచుండును. ఛందస్సమకక్ష మగుప్రమాణదృష్టితో వీరిప్రయోగములు సాధువు లనఁ దగిన వని దీనియాశయము. వైదికప్రయోగము లెట్లు లోకమునఁ బ్రయోగార్హములు కావో యట్లే యీప్రయోగములును లోకమునఁ బ్రయోగార్హములు కా వని యిందలిరహస్యము. ఒకగ్రంథమునకు లక్షణ మేర్పఱచునప్పు డందుండు గుణములు స్వీకార్యము లని నిరూపించుటయు దోషములు పరిహార్యము లని నిరాకరించుటయు లక్షణకర్తలకృత్యములు. కావుననే సంస్కృతమున మహాకావ్యలక్షణ మేర్పఱచినయాలంకారికు లందఱును మహాకావ్యములనుండియే గుణదోషముల కుదాహరణము లొసఁగి గుణములు స్వీకార్యము లనియు దోషములు పరిహార్యము లనియు మన కెఱుకపఱిచిరి. చూడుఁడు.

కావ్యప్రకాశిక—మమ్మటుఁడు.

చ్యుతసంస్కృతి:—వ్యాకరణలక్షణహీనమ్—యథా:—

"ఏతన్మన్దవిపక్వతిన్దుకఫలశ్యామోదరాపాణ్డర
ప్రాన్తం హన్త పులిన్దసున్దరకరస్పర్శక్షమం లక్ష్యతే।
తత్పల్లీపతిపుత్త్రి! కుఞ్జరకులం కుమ్భాభయాభ్యర్థనా
దీనం త్వా మనునాథతే కుచయుగం పత్త్రావృతం మా కృథాః"

అత్రానునాథత ఇతి 'సర్పిషో నాథత'ఇత్యాదావాశిష్యేవ నాథతేరాత్మనేపదం విహితమ్ 'ఆశిషి నాథ' ఇతి. అత్ర తు యాచనమర్థః. తస్మాత్ 'అనునాథతి స్తనయుగమ్' ఇతి పఠనీయమ్."

(దోషప్రకరణము.)

కావ్యానుశాసనము—హేమచంద్రుఁడు.

"శబ్దశాస్త్రవిరోధోఽసాధుత్వమ్" యథా:—

'ఉన్మజ్జన్మకర ఇవాపగాయాః ... అజఘ్నే విషమవిలోచనస్య వక్షః'—అత్ర హన్తేర్నాకర్మకత్వమ్. న స్వాఙ్గకర్మకత్వమిత్యాత్మనేపదాప్రాప్తేరాజఘ్నే పదమసాధు"

ఇట్లే గుణములకును మహాకావ్యములనుండి లక్షణకర్త లుదాహరణము లొసఁగినారు. కావ్యముల ననుశాసింపఁ దలఁచిన హేమచంద్రుఁడు భారవికావ్యములోని 'అజఘ్నే పద మసాధు'వని నిరాకరించినాఁడు. ఇతఁ డిట్లనినాఁ డని యీతనికావ్యానుశాసన మిఁకఁ గావ్యానుశాసకము కాదా ?

ఇట్లే మహాభాష్యకర్తయు మహాకవులగ్రంథములనుండి కొన్ని యపశబ్దముల నుదాహరించి వానిని 'ఛాందసత్వాద్భవిష్యతి, ఛందోవత్కవయః కుర్వన్తి. న హ్యేషా ఇష్టిః, అని నిరాకరించి యవి ప్రయోగార్హములు కా వని మన కెఱుకపఱిచినాఁడు. అవియే శ్రీశాస్త్రిగారు పై నుదాహరించిన 'తపస్యతే లోకజిగీషురగ్న్యః' ఇత్యాదులు. కావున 'ఛందోవత్కవయః కుర్వన్తి. న హ్యేషా ఇష్టిః' 'ఛాందసత్వాద్భవిష్యతి' అని శాస్త్రకర్త లనుటచేఁ 'బాణినీయము కావ్యభాషానుశాసకము కాం' దని శ్రీశాస్త్రిగా రనుట యుక్తము కాదు. ఇట్లే పదకారులను గూర్చియు "న హి పదకారా లక్షణేనానువర్త్యాః, పదకారైర్నామ లక్షణమనువర్తనీయమ్, యథాలక్షణం పదం కర్తవ్యమ్. (మహాభాష్యము. ౮. ౨. ౧. ౧౬.) అని మహాభాష్యకర్త యనినాఁడు. ఇతఁ డిట్లనె నని పదము, క్రమము మొదలగు వేదభాగములకుఁ బాణినీయ మనుశాసకము కా దందుమా ? కా దని మన మనినను 'సర్వవేదపారిషదం హీదం శాస్త్రమ్' అని మహాభాష్యకర్త ర్వవేదములను సమగ్రముగా సాధించినది యీశాస్త్ర మని కంఠోక్తముగాఁ జెప్పినాఁడు.

ఇదిగాక శిష్టవ్యవహారభాషకే పాణినీయ మనుశాసక మని శ్రీ శాస్త్రిగారు సిద్ధాంతీకరించిరిగదా ! ఐన 'వ్యాకరణ మన్వాఖ్యానాతిరిక్తముగా నుండవలయు'నను శ్రీశాస్త్రిగారిసిద్ధాంతప్రకారము పాణినీయ మనుశాసించినసాధుశబ్దములును, నిరాకరించినయపశబ్దములును శిష్టవ్యవహారభాషలోనివియే యనక తీరవు. కావునఁ బ్రకృతము 'ఛాందసత్వాద్భవిష్యతి' అని మహాభాష్యకర్త నిరాకరించిన 'తపస్యతే'మున్నగుశబ్దములు శిష్టవ్యవహారభాషలోనివియే. ఇవి యిట్టి వని శాస్త్రిగా రనుబంధములో నంగీకరించియే యున్నారు. (చూ. అనుబంధము. ౪ పా.) అప్పుడు 'ఛాందసత్వాద్భవిష్యతి'అనుమహాభాష్యధోరణినిబట్టి 'పాణినీయము కావ్యభాషానుశాసకము కా'దని శ్రీశాస్త్రిగా రెట్లు సిద్ధాంతీకరించిరో యట్లే 'పాణినీయము శిష్టవ్యవహారభాషానుశాసకము కా'దని మనమును దానినిబట్టియే సిద్ధాంతీకరింప వచ్చును. కావున 'మహాకవిప్రయోగములే యైనను నసాధువు లైనచో మాశాస్త్రమున కవి ప్రమాణములు—లక్షణమేర్పఱుపఁ దగినలక్ష్యములు—కావు; మహాకవిప్రయోగములుసాధువులే యైన నవి మాశాస్త్రమునకుఁ బ్రమాణములు—లక్షణ మేర్పఱుపఁదగినలక్ష్యములు—కాకపోవు'అనునదియే పై మహాభాష్యమునకుఁ దాత్పర్యము ఇఁక లక్షణకర్తలప్రథమకృత్య మగుసాధుశబ్దనిరూపణమున మహాభాష్యకర్త జాగరూకత వహించి సాధువు లగు మహాకవిప్రయోగములు పాణినీయమునుబట్టి సాధించుచు నవి ప్రయోగార్హము లని మన కెట్లు తెలుపుచున్నాఁడో చూతుఁడు.

'రా మా య ణ ము'

'ఏతి జీవన్తమానన్దో నరం వర్షశతాదపి'

(యుద్ధ. ౧౨౬. ౨.)

ఈరామాయణప్రయోగమున మహాభాష్యకర్త "యోగవిభాగః కరిష్యతే—'అనుదాత్తఙిత ఆత్మనేపదమ్' తతః భావకర్మణోః. తతః 'కర్తరి' కర్తరి చాత్మనేపదం భవతి భావకర్మణోః. తతః 'కర్మవ్యతిహారే,

కర్తరీత్యేవ, భావకర్మణోరితి నివృత్తమ్, యత్రైవ తర్హి కర్మణి కర్తరి భవతి, ఏవం భావేపి కర్తరి ప్రాప్నోతి—'ఏతి జీవన్తమానన్ద' ఇతి" అని యోగవిభాగ మొనర్చినప్పుడు దోషోద్ఘాటన మొనర్చి యీప్రయోగసాధనముకొఱకు మఱియొకయోగవిభాగము నొనర్చి దోషము లేదని సాధించుచున్నాఁడు. "ద్వితీయో యోగవిభాగః కరిష్యతే, 'అనుదాత్తఙిత ఆత్మనేపదమ్' తతో 'భావే'. తతః 'కర్మణి'—కర్మణి చాత్మనేపదం భవతి, తతః 'కర్తరి' - కర్తరి చాత్మనేపదం భవతి, కర్మణీత్యనువర్తతే, 'భావ' ఇతి నివృత్తమ్, తతః 'కర్తృవ్యతిహారే' కర్తరీత్యేవ. కర్మణీతి నివృత్తమ్. (మహాభాష్యము. ౧ ౩. ౨ ౧౨.)

రామాయణమున మఱియొకచోఁ గూడ నీశ్లోకపాదము కలదు.

శ్లో. కల్యాణీ బత గాథేయం, లౌకికీ ప్రతిభాతి మే,
ఏతి జీవన్తమానన్దో, నరం వర్షశతాదపి.

(సుందర. ౩౪. ౬.)

మహాభాష్యకర్తయు మఱియొకచోఁ బైనచిహ్నితము లగు శ్లోకపాదములు రెండును నుదాహరించి సాధించియున్నాఁడు. (చూ. మహాభాష్యము. ౩. ౧. ౪. ౬౭.) ఇశ్లోకటికి రెండుపర్యాయములు మహాభాష్యకర్త రామాయణప్రయోగము సాధు వని చెప్పినాఁడు. ఇఁక 'రామాయణప్రయోగములను మునిత్రయమువారు సాధువు లని సాధింపఁ దలపెట్ట లే' దని శాస్త్రిగా రనుట యెట్టిదియో నా కెఱుఁగరా కున్నది.

రామాయణమునకుఁ దరువాతిమహాకావ్యములలోఁ గలమహాకవిప్రయోగములు నయిత మితఁ డెట్లు సాధించినాఁడో గమనింపుఁడు.

## రా వ ణా ర్జు నీ య ము.

కవి భీమసేనుఁడు. కథావస్తువు కార్తవీర్యార్జునుచరిత్రము. పాణినీయసూత్రములు పైన నుదాహరించుచు నానికి లక్ష్యములుగా నీకావ్యమందలిశ్లోకములు కవిచే వ్రాయఁబడినవి. పాణినీయము కావ్య

భాషానుశాసక మనుదృష్టితోఁ గవి యీకావ్యమును వ్రాసినాఁ డని వేఱుగా నిరూపింప నక్కఱ లేదు. శాస్త్రిగా రపాణినీయము లని యుదాహరించినవియుఁ బాణినీయసాధ్యము లని మనము నిరూపించి నవియు నగుప్రయోగములు కొన్ని యీకావ్యములోను గనఁబడు చున్నవి. ఈకావ్యములోనిదే యీక్రిందిశ్లోకము.

"ఉదగాత్కఠకాలాపం ప్రత్యష్ఠాత్కఠకౌథుమమ్,
ఏషాం యజ్ఞే ద్విజాతీనాం, తద్విఘాతిభిరన్వితమ్." (౭. ౪.)

ఈశ్లోకములోని మొదటిరెండుపాదములను 'అనువాదేచరణానామ్' అనుసూత్రమునకు లక్ష్యములుగా మహాభాష్యకర్త ప్రదర్శించినాఁడు. "అనువాదే చరణానామ్'.—ఇహ కస్మాన్న భవతి—నద్ధస్తు కఠకాలాపాః, వర్ధన్తాం కఠకౌథుమాః, 'స్థేణోః'—స్థేణోరితి వక్తవ్యమ్, ఏవమపి 'తిష్ఠన్తు కఠకాలాపా'ఇత్యత్రాపి ప్రాప్నోతి, *'అద్యతన్యాంచ' అద్యతన్యాం చేతి వక్తవ్యమ్. "ఉదగాత్కఠకాలాపం ప్రత్యష్ఠాత్కఠకౌథుమమ్." (మహాభాష్యము. ౨. ౪. ౧. 3.)

జా న కీ హ ర ణ ము.

ఈకావ్యమును రచించినవాఁడు కుమారదాసు. ఉజ్జ్వలదత్తునిచే నీకావ్యమునుండి యనేకోదాహరణము లుణాదిసూత్రవృత్తిలోఁ బ్రదర్శింపఁబడినవి. దీనిలోనిదే యీక్రిందిశ్లోకము.

శ్లో. అయి విజహీహి దృఢోపగూహనం
త్యజ నవసఙ్గమభీరు వల్లభమ్,
అరుణకరోద్గమ ఏష వర్తతే
వరతను సంప్రవదన్తి కుక్కుటాః ॥

ఈశ్లోక మీకావ్యములోని దని క్షేమేంద్రాదు లౌచిత్యవిచారచర్చాదిలక్షణగ్రంథములలోఁ గూడ నుదాహరించినారు. (చూ. ఔచిత్యవిచారచర్చ. ౨౧ పు.)

---

*'అద్యతనీతి లుఙస్సంజ్ఞా' (ఉద్ద్యోతము.)

ఇఁక 'వ్యక్తవాచామ్' అనుసూత్రభాష్యమున నీశ్లోకచతుర్థపాద
మెట్లనుకరింపఁబడి సాధింపఁబడినదో తిలకింపుఁడు.

"వ్యక్తవాచాం సముచ్చారణే" వ్యక్తవాచామితి కిమర్థమ్.
"వరతను సంప్రవదన్తి కుక్కుటాః" వ్యక్తవాచామిత్యుచ్యమానే
ఽత్ర ప్రాప్నోతి. ఏతేపి హి వ్యక్తవాచః. అతశ్చ వ్యక్తవాచః.
కుక్కుటేనోదితే ఉచ్యతే కుక్కుటో వదతీతి. ఏవం తర్హి వ్యక్తవాచ
చామిత్యుచ్యతే. సర్వ ఏవ హి వ్యక్తవాచస్తత్రప్రకర్షగతిర్విజ్ఞాస్యతే.
సాధీయో యే వ్యక్తవాచ ఇతి. కే చ సాధీయః. యేషాం వాచ్యకా
రాదయో వర్ణా వ్యజ్యన్తే. న చైతేషాం వాచ్యకారాదయో వర్ణా
వ్యజ్యన్తే. అతశ్చ వ్యజ్యన్తే. ఏవం హ్యాహుః "కుక్కుటాః కుక్కు"డితి.
నైవం తే ఆహుః. అనుకరణమేతత్తేషామ్. అథవా నైవం విజ్ఞాయతే
వ్యక్తా వాగ్యేషాం త ఇమే వ్యక్తవాచ ఇతి కథం తర్హి వ్యక్తా వాచివర్ణా
యేషాం త ఇమే వ్యక్తవాచ ఇతి" (మహాభాష్యము. ౧. ౩. ౨. ౪౮.)

కుక్కుటములు వ్యక్తవాక్కులు గావు గనుకఁ బైసూత్రమున
నాత్మనేపదము రాక 'సంప్రవదన్తి' అనుపరస్మైపదము సాధువైన
దని మహాభాష్యకర్త యనుచున్నాఁడు. కుక్కుటములు వ్యక్తవాక్కు
లా ? కావా ? అని విపులముగాఁ జర్చించి వ్యక్తవాక్కులు గావని
స్థిరపఱిచినాఁడు. మొత్తముమీఁద నీసూత్రభాష్యమంతయు నీకావ్య
ప్రయోగవిషయక మగుచర్చతోడనే ముగిసినది. పాణినీయము కావ్య
భాషానుశాసక మనుటకు మహాభాష్యఫక్కి సాధకమో బాధకమో
యిఁకఁ బాఠకులే యూహింపుఁడు.

కొందఱు విమర్శకు లీకవులే మహాభాష్యమునుండి పైశ్లోకపాద
ములను గ్రహించి తమకావ్యములలోఁ జేర్చికొనినా రనుచున్నారు.
వీరైన నీవాదమునకుఁ దగుప్రమాణములఁ జూపినవారు కారు. పరి
శోధించిన నీకావ్యములు ప్రాచీనము లనుటకు సందేహము లేదు.
ఇప్పటికి సంస్కృతమున జరిగినకావ్యకాలనిర్ణయము గాని కవికాలనిర్ణ

యము గాని సరి యగునది కాదు. వీరిపరిశోధనమున నెందఱు కవులో యెన్నికావ్యములో తాఱుమాఱు అయినవి. A.D వారు B.C వారుగను, B.C వారు A.D వారు గను మాఱినారు. అవి యట్టివని నిర్ణయింపఁ గలప్రబలప్రమాణములు గలవు. అవి య టుండనిండు. మహాభాష్య కర్తనుండి వీ రీపాదములు గ్రహించి ప్రయోగించి రనినను వీరిగ్రంథ ములనుండి గ్రహించి మహాభాష్యకర్త సాధించినాఁ డనినను 'కావ్య భాష పాణినీయానుశిష్ట మైన'దనియే స్థిరపడును. ఒకలక్షణకర్త కావ్య వాఙ్మయమునుండి లక్ష్యములు సంగ్రహించి వ్యాకరణము రచించినాఁ డనినను, లక్షణకర్త సాధించినలక్ష్యములు కావ్యకర్తలు గ్రహించి ప్రయోగించినా రనినను ఫలము తుల్యమేగదా!

"మనుస్మృతి"

'దూరాదావసథాన్మూత్రం దూరాత్పాదావసేచనమ్'.

(౪-౧౫౧.)

"దూరాన్తికార్థేభ్యో ద్వితీయా చ—వా. దూరాన్తికార్థేభ్యః పంచమీవిధానే తద్యుక్తాత్పంచమీప్రతిషేధః. దూరాన్తికార్థేభ్యః పంచమ్యాః ప్రతిషేధో వక్తవ్యః. దూరాద్గ్రామస్య. నవా తత్రాపి దర్శనాదప్రతిషేధః. అనర్థకః ప్రతిషేధోప్రతిషేధః. నవా తత్రాపి దర్శనాత్పంచమ్యాః ప్రతిషేధోనర్థకః తత్రాపిహి పంచమీ దృశ్యతే. "దూరాదావసథాన్మూత్రం దూరాత్పాదావసేచనమ్" "దూరాచ్చ భావ్యం దస్యుభ్యో దూరాచ్చ కుపితాద్గురోః."

(మహాభాష్యము. ౨. 3. ౨. 3౫.)

పైవార్తికముచే దూరాన్తికార్థములకుఁ బంచమి విధింపఁబడి తత్సన్నిహితము లగుగ్రామాదిశబ్దములకుఁ బ్రతిషేధింపఁబడినది. దీని మూలమున 'గ్రామస్య దూరాత్' అనునర్థమున 'దూరాద్గ్రామాత్'

(1) "దూరాచ్చ భావ్యం దస్యుభ్యో దూరాచ్చ కుపితాద్గురోః" అను నీరెం డుపాదములు మనుస్మృతిలోఁ గనఁబడ లేదు. ఏస్మృతినుండి గ్రహించెనో పరిశో ధింపవలెను.

వంటిప్రయోగము లసాధువు లగుచుండఁగా మహాభాష్యకర్త 'ఆవస థస్య దూరాత్' అనునర్థమున 'దూరాదావసథాన్మూత్రమ్' అను మను స్మృతిప్రయోగమును బ్రదర్శించి 'నవా తత్రాపి దర్శనాదప్రతి షేధః' అనువార్తికమున దూరాదిశబ్దసన్నిహితము లగునావసథాది శబ్దములకును బంచమీప్రయోగము సాధు వనుచున్నాఁడు. ఇట్లు స్మృత్యాదులలోనిభాషను సైతము పాణినీయ మనుశాసించి యున్నది.

ఉపతిష్ఠతే-ఉపతిష్ఠతి.

"సూ. ఉపాన్మంత్రకరణే." వా. ఉపాద్దేవపూజాసంగతకరణయోః. ఉపాద్దేవపూజాసంగతకరణయోరితి వక్తవ్యమ్. దేవపూజాయామ్. ఆదిత్య ముపతిష్ఠతే. చంద్రమసముపతిష్ఠతే...

శ్లో. బహూనామప్యచిత్తానామేకో భవతి చిత్తవాన్,
పశ్య వానరసైన్యేస్మిన్యదర్క ముపతిష్ఠతే.

శ్లో. మైవం మంస్థాస్సచిత్తోయమేషోఽపి హి యథా వయమ్,
ఏతదప్యస్య కాపేయం యదర్క ముపతిష్ఠతి.

(మహాభాష్యము. ౧. ౩. ౨. ౨౫.)

ఇందలి రెండుశ్లోకములును "ఉపాద్దేవపూజాసంగతకరణయోః." అనువార్తికమున కుదాహరణప్రత్యుదాహరణములుగాఁ బతంజలిభగ వానునిచేఁ బ్రదర్శింపఁబడినవి. 'ఉప'పూర్వక మగు'స్థా'ధాతువునకు దేవపూజాసంగతికరణములఁ జెప్పునప్పు డాత్మనేపదమును, తదితరసమ యమునఁ బరస్మైపదమును వచ్చు నని పై వార్తికాభిప్రాయము మొదటిశ్లోకమునఁ జెప్పఁబడినయాదిత్యోపస్థానము దేవపూజావిష యముగ భావింపఁబడుటచేఁ గవి 'ఉపతిష్ఠతే' యని యాత్మనేపదప్ర యోగ మొనర్చినాఁడు. రెండవశ్లోకములోనియాదిత్యోపస్థానము చాపల్యమునే సూచించుచున్నది గావున, దేవపూజాసందర్భము కా దని యాత్మనేపదప్రయోగమును మాని 'ఉపతిష్ఠతి' అని పరస్మైపదమునే

ప్రయోగించెను. పై ప్రయోగములను వార్తికకారునివార్తికమును బరిశీలించునప్పుడు సహృదయు లగువారి కిట్టిప్రయోగములకొఱకే ప్రధానముగా వార్తికకారుఁ డీవార్తికముచు రచించె నని తోఁపకపోదు.

"కాలః పచతి భూతాని కాలస్సంహరతి ప్రజాః"

"కాలసమయవేలాసు తుమున్" వా. ప్రథమాంతేషు ప్రథమాంతేష్వితి వక్తవ్యమ్. కిం ప్రయోజనమ్. ఇహ మా భూత్. కాలే భుంక్తే. తత్తర్హి వక్తవ్యమ్. న వక్తవ్యమ్. ప్రైషాదిష్వితి వర్తతే. తచ్చావశ్యం ప్రైషాదిగ్రహణమనువర్త్యమ్. ప్రథమాంతేష్వితి హ్యుచ్యమానే ఇహాపి ప్రసజ్యేత.

"కాలః పచతి భూతాని కాలస్సంహరతి ప్రజాః"

(మహాభాష్యము. 3. 3. ౨. ౧౬౭)

పై సూత్రమునఁ బ్రైషాదిగ్రహణానువృత్తికిఁ బ్రయోజనము 'కాలస్సంహరతి, కాలఃపచతి' అనుమహాకవిప్రయోగములసాధనమఁట.

1. "శంఖదుందుభివీణానామ్"
2. "మృదంగశంఖతూణవాః పృథఙ్నదంతి సంసది"
3. "ప్రాసాదే ధనపతిరామకేశవానామ్"

"అల్పాచ్తరం" కిమయం తంత్రం తరనిర్దేశః. ఆహోస్విదతంత్రమ్. యది తంత్రం ద్వయోర్నియమో బహుష్వనియమః. తత్ర కో దోషః. "శంఖదుందుభివీణానా" మితి న సిద్ధ్యతి. దుందుభిశబ్దస్యాపి పూర్వనిపాతః ప్రాప్నోతి. అథాతంత్రమ్. "మృదంగశంఖతూణవాః పృథఙ్నదంతి సంసది" "ప్రాసాదే ధనపతి రామకేశవానామ్" ఇత్యేతన్న సిద్ధ్యతి.

యథేచ్ఛసి తథాస్తు, అస్తుతావత్తంత్రమ్. నను చోక్తమ్ ద్వయోర్నియమో బహుష్వనియమ ఇతి. తత్ర "శంఖదుందుభివీణానా"మితి

న సిధ్యతి, దుందుభిశబ్దస్యాపి పూర్వనిపాతః ప్రాప్నోతీతి. నైష దోషః. యదేత'దల్పాచ్‌తర'మితి. తదల్పాజితి వక్ష్యామి. అథవా పునరస్త్వతన్త్రమ్. నను చోక్తమ్.- "మృదఙ్గశఙ్ఖతూణవాః పృథఙ్నదన్తి సంసది" "ప్రాసాదే ధనపతిరామకేశవానామ్." ఇత్యేతన్న సిధ్యతీతి. "అతన్త్రే తరనిర్దేశే శఙ్ఖతూణవయోర్మృదఙ్గేన సమాసః అతన్త్రే తరనిర్దేశే శఙ్ఖతూణవయోర్మృదఙ్గేన సహ సమాసః కరిష్యతే శఙ్ఖశ్చ తూణవశ్చ శఙ్ఖతూణవౌ మృదఙ్గశ్చ శఙ్ఖతూణవౌ చ, మృదఙ్గశఙ్ఖతూణవాః, రామశ్చ కేశవశ్చ రామకేశవౌ ధనపతిశ్చ రామకేశవౌ చ ధనపతిరామకేశవాః, తేషాం ధనపతిరామకేశవానామితి." (మహాభాష్యము. ౨. ౨. ౨. ౩౮.)

ఇంత విపులముగా విమర్శించి విగ్రహప్రదర్శనముతోఁ బై మహాకవిప్రయోగముల నరమర లేక సాధించుచున్న మహాభాష్యము 'పాణినీయము కావ్యభాషానుశాసకము కా'దనియే యనుచున్నదా ?

"వాతాయ కపిలా విద్యు, దాతపాయాతిలోహినీ,
కృష్ణా సర్వవినాశాయ, దుర్భిక్షాయ సితా భవేత్."

"ఉత్పాతేన జ్ఞాప్యమానే" ఉత్పాతేన జ్ఞాప్యమానే చతుర్థీ వక్తవ్యా. "వాతాయ కపిలా విద్యు దాతపాయాతిలోహినీ, కృష్ణా సర్వవినాశాయ దుర్భిక్షాయ సితా భవేత్." (మహాభాష్యము. ౨. ౩. ౧. ౧౩.)

"వాతాయ, ఆతపాయ" మొదలగువానిలోని చతుర్థీవిభక్తి "ఉత్పాతేన జ్ఞాప్యమానే" అను వార్తికమున సాధువగుచున్నదని మహాభాష్యకర్త యనుచున్నాఁడు.

"ఉపస్నాతం స్థాలసిక్తం, తూష్ణీంగఙ్గం మహాహ్రదమ్,
ద్రోణం చేడశకో గన్తుం మా త్వా తాప్తాం కృతాకృతే"

"చార్థేద్వన్ద్వః... శేష ఇతి వర్తతే... యది శేష ఇతి వర్తతే, "ఉపస్నాతం స్థాలసిక్తం తూష్ణీంగఙ్గం మహాహ్రదమ్, ద్రోణం చేదశకో గన్తుం, మా త్వా తాప్తాం కృతాకృతే" ఇత్యేతన్న సిధ్యతి నైష దోషః అన్యద్ధి కృతమన్యదకృతమ్." (మహాభాష్యము. ౨. ౨. ౨ ౨౯.)

(సశేషము.)

# కావ్యార్థసంగ్రహ సమాలోచన.

ఉభయభాషాప్రవీణ, **మల్లాది సత్యనారాయణశాస్త్రి.**

ఈలోకమున నెవరైన నొకకావ్యాదిగ్రంథరచనకు దిగినా రనఁగా వా రాగ్రంథరచనకుఁ బూర్వము (1) చాలపర్యాయములు వ్యస్తమిశ్రాన్యతరములుగఁ దమవినికిచూపులయనుభవములలోనికి వచ్చినదియు, నాకాలపు స్వదేశ జనసామాన్యమునకుఁగూడ నట్లుపరిచిత మగునదియు, ఆ సంపూర్ణకథలో జనసామాన్యము మెచ్చఁదగు మంచి యద్ధకమును, జెప్పుకొనఁదగు చెడ్డ స్వల్పమును గలుగుటయే గాక వానికి మిగుల విరుద్ధార్థములుగాని యవాంతరకథాంశములతో నిండియున్నదియు నగు స్త్రీపురుషుల సంపూర్ణచరితమునుగాని, (2) తాము చూడకున్నను వినికిలి మొదలగునవి పైవిధముగనే గలవారి చరితమునుగాని, (3) యట్టిచరితములనుండి యుద్ధరించినదియు, నందలి సత్యమును గప్పిపుచ్చక యక్కడక్కడఁ జమత్కృతికై కొంచె మందమగు మార్పును జేసినదియుఁ, జెప్పక పోయినను బాఠకవిమర్శకుల బుద్ధికి స్ఫురింపఁదగు రసవద్భాగము గాక మిగిలిననీరసాసహ్యభాగముల స్పర్శము కూడ లేనిదియు నదిగా బయలు వెడలఁదీసిన యొకానొకకథాభాగమును దాని సంపూర్ణతాసంపూర్ణతలతో నిమిత్తము లేకుండ నొకానొక సంఘట్టముతోఁ బూర్తియని యన్నఁబడుదానిని గాని పదిమంది పెద్దమనుష్యులు నొకచోఁగూడి కాని విడివిడిగాఁ గాని వినను జదువను దగునట్లుండు రసాదిసంవిధానము గలదిగ నేర్పఱచుకొని పిదప నాగ్రంథరచనకుఁ గడంగినా రని మనము మనబహుపూర్వులగ్రంథనిర్మాణప్రణాళికను బట్టి గ్రహించుకొనవలసియుండును. ఈ చెప్పినదానికి నుదాహరణములు వరుసగా (1) మహాభారతము, (2) శ్రీమద్రామాయణము, (3) రఘువంశాది మహాకావ్యములును, అందు మహాభారతము పరీక్షిత్తునిపరిపాలనా

కాలమునఁగాని యుధిష్ఠిరునిపరిపాలనాకాలమునఁగాని వ్యాసమహా ముని వ్రాసి జనమేజయుఁడు వినుటకుఁగాను వైశంపాయనునిచేఁ బ్రక టింపించినాఁడు. రమారమి యొకవందయేండ్లయిన నిది బహిర్గతము కాలే దని చెప్పవచ్చును, రామాయణము (మొదటియాఱుకాండములు) రాముఁడు రావణుని సంహరించి సీతతోఁగూడి యయోధ్యాపట్టణమునఁ బట్టాభిషిక్తుఁడయి రాజ్యము నేలుతఱిని నీ చరితము సంగ్రహముగ నారదునివలన నాలకించి బ్రహ్మచే నా జ్ఞనిపించుకొని వాల్మీకి విపులముగ వ్రాసినాఁడు. దీని ప్రకటనము పదివేల తొమ్మిదివందలసంవత్సరముల పిమ్మట జరిగిన దని శ్రీమద్రామాయణమువలననే తెలియుచున్నది. రఘువంశాది మహాకావ్యములు గొన్ని క్రీస్తునకు ముందు రెండుమూఁడు వందల సంవత్సరములలో నొక్కట నుండు సుప్రసిద్ధమహాకవి కాళిదాసునిచే శ్రీమద్రామాయణ మహాభారతాది గ్రంథములనుండి యుద్ధరించిన కథలతోఁ గూర్పఁబడినవి. ఇట్టులే మిగిలినకవులచేతను దక్కుంగల కావ్యనాటకములును వ్రాయఁబడినవి. ఇట్లనుటచేఁ గల్పనాకథాప్రధానకావ్యములు లే వని యెన్నఁ దగదు.

అ ట్లీగ్పఱచుకొనినసంవిధానముగలయాచరితమును గద్య పద్యోభయాన్వితరాత్మక గ్రంథరూపముగ రచించుటవలన నాకవులకు మనస్సంతుష్టి యెట్టి దృష్టఫలదర్శనమువలనఁ గలుగఁబోవు ననఁగా నా స్త్రీపురుషుల చరితమును బొత్తుగఁగాని కొంచెముగఁగాని తారుమారు చేసితిమి గదా యనికాదు. ఈప్రపంచములోఁ బుట్టిపెఱుగు ప్రతిమనుష్య జాతిలో నుత్తమ మధ్య మాధమా ధమాధమములనఁ దగు నాలుగు రకముల నడవడికలు దేశకాలపాత్ర దశాభేదముల ననుసరించి వ్యస్త మిశ్రమములుగఁ గలవారు ప్రతికాలమందుఁ గలుగుచుందురు గాన సట్టి తమకాలమందలియుఁ దమపిమ్మటికాలమందలియు జనసమూహము నకు నా సత్కథయందున్న నానావిధముల యంశములను సత్యావిదూరములుగ మలచి చక్కఁజేసి వినసొంపుగ విశదపఱచితిమి గదా యను

నట్టియు, దానిని వినుటవలన వారు మతి మరల్చుకొని యావఱకుఁ గావించిన పొరపాటులను బొరపాటులుగా గ్రహించి యిప్పటినుండి యైన వానిని జేయరా దని నిశ్చయించుకొని మంచిత్రోవకుఁ బోవను ద్యుక్తులగుదురుగదా యనునట్టియు, దృష్టప్రయోజనమును జూచికొని యని సమాధానముఁ జెప్పనగును.

ఆకవి కిందు స్వప్రయోజనములు చాల తక్కువగ నుండినట్లు స్థూలదృష్టికిఁ దెలియుచున్నను విచారణ చేసినమీఁదట నాయవియాను షంగికములుగ మాత్రము చాలగల వని మనము తెలిసికొనఁగలము. ఎట్లన, ఆకవిచేసిన ప్రయత్నము సమకాలసద్విమర్శకులకు నానావిధములుగ సంతస మిచ్చునది యైనచో దానివలన నెక్కడఁజూచినను లెక్కకు మిక్కిలి కీర్తి పురస్సరధనరాసులు స్వాయత్తములై నిలుచు నని యట్టి యిప్పటి కొంతమందికవుల యనుభవమువలనఁ గొంతవఱకు మనకుఁ దెలియుచున్నదిగదా. ఆనంతరకాలిక విమర్శకుల మనోవికాసమునకుఁ గారణ మైనచో నదియపుడు దిగంతవిశ్రాంతయశశ్చంద్రికల నీనునది యై శారదరాత్రుల వెన్నెలతేనిని నిరసింపించుటయేగాక యామనిపవళుల సాయంసంపదలను విస్మరింపఁ జేయఁజాలునుగదా. వానివలన నిత్యాపవర్గము చూఱఁగొన నధికారము కరతలామలక మై యుండు నని ధర్మశాస్త్రము లుద్ఘోషించుచున్నవి. నిరంతరము నుత్తమ, మధ్యమ, వ్యస్తులగుణాద్యనువర్ణనమున మనోవాక్కులకుఁ బరిశుద్ధి యేర్పడి సంచితాగామి దుష్టకర్మల ఫలానుభవమున మాచిదగు మాద్పుగలిగి యమంగళ నివృత్తియుఁ జేకూరును గదా. అయ్యాయిచోటుల నయ్యాయి విధముగ నుచితసంభాషణాదులను సంగ్రథించుటవలనఁ దా నొంటరి వాఁడుగా నుండినను వ్యావహారిక జ్ఞానముకూడఁ దఱిగిపోదుగదా. గ్రంథనిర్మాణసమయమున నాయావస్తు రస భావాది చమత్కార కారణసామగ్రీవిన్యాస సోఫగణోట్టంకనములయందును, వానికిఁ దగిన

కరుణ సరళా ద్యతిరసంకలితశబ్దసమ్మేళనక్రియాదులయందును, ప్రకృత వస్తూచితరసభావానుగుణశబ్దార్థగుణాలంకార సంపాదనమునందును, రీతిపాకశయ్యావృత్తులయందును, గొంచెముగనో గొప్పగనోయెట్టి కవికిని నవధానదానకరత్వరూపమగు పరిశ్రమ తప్పకయుండిమధ్యమధ్య రసతన్మయీభవనవిషయమునఁ జిత్తమునకు విలంబస్ఫురణమనుభంగపా టు నాపాదించుచున్నను నిర్మాణానంతరమున నాగ్రంథముసంపూర్ణముగ భావకులతోఁపాటుగ సావకాశముగ నా కవిచేతను భావకత్వసామగ్రితో రచనాకాలికపరిశ్రమవిస్మరణపూర్వకముగ సంభావింపఁబడి నిరంతరబ్ర హ్మానబ్రహ్మాచార్యానందమును గలుగఁజేయునుగదా. కనుక నీద్వైవిధ్య ప్రయోజనములును గవికి వల దన్నను బోవునవికావు.

కాని యివి స్వప్రధానప్రయోజనములుగఁ జేసికొని యుత్తమ కవి యెవఁడును ఎన్నఁడును గ్రంథరచనకుఁ గడంగఁ డని మనపెద్దల లక్ష్య లక్షణగ్రంథరచనాపద్ధతినిబట్టి యూహింప శక్యము. చూడుఁడు నాట కాదులలో నాందీ శ్లోకములు సాధారణముగ "మీకు శుభములనిచ్చు గాక" మను మొదలగురీతుల యుష్మదర్థకర్మకములుగా నుండుటకుఁ గారణ మేమయియుండును? తక్కిన యదృష్టఫలములమాట యెట్లు న్నను ఈశుభములనైనఁ గవి తనవిగాఁ గోరుకొనఁ దగఁడా? మఱియు నిచటఁగూడఁ బరంపరగాఁ గవి తన యభీష్టములకుఁ బాటుపడక పోలేదు. ఎట్లనఁ గవియొక్కలోకోత్తరకృతి ప్రధానముగాఁ బాఠకానం దసాధనముగానఁ బాఠకక్షేమ మభిలషించుకవి, తనకృతిక్షేమమును గూడఁ గోరినవాఁడే యగును. అట్లగుటచే నాకొంటిక కొలదికాలమే నిలుచుతనశరీరక్షేమమును గోరుటకంటె, శాశ్వతముగా నుండుతన యశఃకుశలమును గోరుట యుత్తమమయిన దగుటను బట్టి శ్రేష్ఠమైనది. అది ప్రత్యక్షముగా లేదు గానఁ గావ్యప్రయోజనములగు యశోధనా దులు పయిన వర్ణించినట్లుగాక స్వప్రధానప్రయోజనములని మాత్ర మెట్లు చెప్పవచ్చును? అవి యానుషంగికములే యైయున్నచో వాని ఫల

ములను సేకరింప నెవరికి సమ్మతి కాకపోవును? కనుక మయూరాది మహాకవులు సూర్యాదిదేవతలవలన నమంగళనివృత్తి మొదలగు శ్రేయస్సంపదలను బొందినట్లు వినఁబడుచున్నను వారు స్వార్థపరులు గారనియు నానుషంగికఫలభోక్తలనియు నిర్ణయింపఁదగుదురు. ఆకారణముచే నేను మొదటఁ జెప్పినట్లుగ నాటకావధియగు నుపదేశప్రవణతయందు నీసత్కృతికిఁ బ్రధానతాత్పర్యమని స్పష్టమగుచున్నది. కనుకనే రామాయణాది మహాకావ్యములకు "రామాది వత్ప్రవర్తితవ్యం. నరావణాదివత్" అని యీరీతినే యుపదేశపరతాత్పర్యమును బోధించుట యాచారములోనికి వచ్చినది. ఈ యభిప్రాయమును నాలంకారికశిరోమణియగు మమ్మటభట్టు తన కావ్యప్రకాశమున "కావ్యం యశసే, ఽర్థకృతే, వ్యవహారవిదే, శివేతరక్షతయె, సద్యఃపరనిర్వృతయె, కాంతాసమ్మితతయోపదేశయుజె." అని గంభీరవాక్కుల నెల్లడించినాఁడు. అందు నాటకావదానికి మిగులఁ బ్రాధాన్యము గల దనునట్లు మిగిలిన యంశములకంటె దాని నధికముగను మృదువుగను సరసముగను విశేషించి దానికి విపులముగ వ్యాఖ్య యొనరించినాఁడు. ఇట్లు కవికి నానుషంగికప్రయోజనములైన యీవ్యవహారజ్ఞానాదులు సవిమర్శపాఠకులకుఁ బ్రధానప్రయోజనములుగ నిర్ణయింపఁబడినవి గాన గ్రంథరచనయనునది ప్రత్యక్షముగఁ బరక్షేమప్రవృత్తమని విస్పష్టమగుచున్నది. మఱియు యోగుల శరీరముల మాట యెట్లున్నను సామాన్యమనుష్యుల శరీరములు క్రమముగఁ బరిణామమందఁదగినవియే కాని స్థిరములుగా నుండఁదగినవి కావు. కావ్యములన్ననో బాగుగ నిర్మింపఁబడినవై యుగాంతములవఱకు నిలుచునవియై యుండును. అట్లయినపుడు కావ్యప్రయోజనములు కవ్యపేక్షితములుగ నుండఁదగునో పాఠకాకాంక్షితములుగ నుండఁదగునో విమర్శకులూహింతురుగాక. చాలు; నిఁకఁ బ్రసంగానుప్రసంగవృత్తాంతలేఖనమున; ప్రస్తుతమునకు వత్తము.

ఆసంవిధానప్రకారముగ నారచనకుఁ గడంగుకవయిత్రులు తమ కావ్యముల నుత్తమనాయకకథాశ్రయములుగ నొనరింపఁజూచుట స్వా

భావిక మనునట్లు పూర్వగ్రంథపరిశీలనవలనఁ దెలియుచున్నది. కథానాయకులయం దుత్తమత్వ మనఁగా జన్మ వంశ విద్యా మనీషా వినయ వితరణ పరాక్రమ దాక్షిణ్యాది విషయములయందు నాయాదైశిక కాలికమహాజనులచేఁ గీర్తింపఁబడు నాధిక్య మని బహులుచెప్పనగును. ఈ సుగుణసంపత్తిగలవారే నాటకాదులలో నాయకులుగ నెందులకు వని బంధింపఁదగుదు రనఁగా నానాటకాది ప్రదర్శన, పఠనకాలములందు నేర్పరులగు నటక పాఠకులచేఁ జక్కఁగ నటింపఁబడఁగాఁ గాని భావింపఁబడఁగాఁ గాని చూచుచు భావించుచు నుండినఁ బైనవర్ణించిన నాలుగురకముల గుణములు గలవారలు తమ సహృదయత ననుసరించి యయ్యాయిరసాదుల స్ఫురణ సంఘట్టములయందు నానటాదులను, ననుకార్య రామాద్యభిన్నభావమున గ్రహించుచుఁ దద్భావభావితులై రసాద్యాస్వాదనమహిమమునఁ దన్మయీభావమునొంది బ్రహ్మానందమున నోలలాడుచు నాటకదర్శన పఠన పర్యవసానమునఁ దన్నిబద్ధ వస్త్వనుభూతిని బట్టి తమ జీవితదశలోఁ దాముగాని సంఘముగాని యప్పుడప్పుడు మోహాదులవలనఁ గావించిన దురాచారములను జ్ఞప్తికిఁ దెచ్చుకొని వానివలన జనులకు రాఁదగు కష్టనిష్ఠురముల నూహించి యప్పటినుండియైనఁ దమశక్తికొలఁదిని నా దురాచారములను లోకము నుండి పోఁద్రోల సర్వవిధముల నాయత్తపడుటకని సమాధానము చెప్పఁదగును. కనుకనే కాళిదాసాది నాటకకర్తలుగాని భరతాదినాట్య లక్షణకర్తలుగాని తమ గ్రంథములలో నుత్తమనాయక గుణాద్యను వర్ణనము చేసి యుంటయుఁ జేయుచుంటయు సంభవించినది. నీచనాయకుల యను భావవర్ణనములవలన సహృదయసభ్య లోకప్పుడు పైనఁ జెప్పినట్లు బ్రహ్మానందమును బొందినను వారికి నాగ్రంథమునకు మకుటభూతమగు వస్తువు వలన నేర్పఁదగిన యంశ మంతగ నుండదుగదా. ఈ విషయము ముందు మరల విపులముగఁ జర్చింపఁబడఁగలదు. ప్రసంగము వచ్చినది కాఁబట్టి వ్రాయుచుంటిని. వ్యవధాన మొసఁగినందులకు మన్నింపుఁడు.

పై విషయమును బట్టి యనుగ్రుతాచార జ్ఞాన మొకవైపునను విమర్శనాజన్యజ్ఞానము వేఱొకదిక్కునను బుట్టి పెఱిగినట్లు మన కనులకు గోచరించుచున్నను వస్తుతత్త్వ విమర్శనాదృష్టితోఁ బరిశీలించినచో నవి యంత మొఱముగా నుండినవి కావనియు సమానవిషయానుభవ వాసనా బలము ననేకకాలమందలి యనేకులమానసములయందుఁ గాని భిన్న కాలము లందలిప్రత్యేకవ్యక్తులమనస్సులయందుఁగాని యేకవిధముగఁ బరివర్తించు నొకానొక కట్టుబాటునఁదగు ధర్మనిబంధనోద్దేశ్యమువలన నుత్పన్నములగు పౌర్వాపర్యసముద్భూతసామాన్యవిశేషధర్మజ్ఞానము లనియు, వానికి సన్నిహితకారణమగు ధర్మనిబంధన మొకటియై యుండి నపుడు వానిని విభిన్నములుగఁ జేయరామిని నొకటిగాఁ జెప్పుట యుక్త మనియు గనుకనే లక్ష్యలక్షణగ్రంథనిర్మాతలు పరస్పరము దేశకాల ములవలన దూరస్థులై విభిన్నులై యున్నను గాకున్నను వా రొకరినొకరు లక్ష్యలక్షణ సమన్వయములలో నుల్లంఘింపఁ జూచినవారు గా రనియు వారి ప్రవర్తనలలోఁ గొంచెముగఁ గలిగినట్లు మనకనులకు గోచరించు భేదములు రసాది విన్యాస ప్రయత్నమూలకములుగాని వేఱొండు గా వనియు మనము గ్రహింపవలసి యుండును. మఱియు లక్షణకర్తలు తమ లోఁదాము భిన్నాభిప్రాయములను (అనఁగా నొకరు గా దన్నది మఱి యొకరు తప్పక యగు ననియు, నవు నన్నది కా దనియు ననురీతిని) గలిగి యుండవచ్చును గాని లక్ష్యనిర్మాతలుమాత్రము వారితో వివదింపక తమలోఁదామును గావ్యమునకు గుణముల నాపాదించుటలో నొకరి నొక రుల్లంఘింపఁజూచినను మత్సరగ్రస్తులుగా రని నాయూహ. "ఉపేయ ప్రతిపత్త్యర్థ ముపాయా అవ్యవస్థితాః" అను కారిక, పై యభిప్రాయము లను బోధించుచున్నదిగాదా! ఒక్క విషయమును గమనింపుఁడు. ఇప్పటి యీ ప్రపంచములో ననేక దేశములున్నవి. ఆదేశములలో నొక్కొక్క భాషయందును పూర్వపశ్చిమాది దేశస్థలత్వ భేదముచేత నుచ్చారణాదు

లోకైక తీరున నుండి యున్నవియా? కాని కర్తృ కర్మాది శబ్దవ్యవస్థ యొక విధముగనే యుండుచున్నదిగదా. దానికిఁ గారణ మేమయియుండును? మఱియు నా దేశములలో నాచారములు వేఱు. భోజనములు వేఱు. వారి పదార్థములును వేరు. ఆటపాటలును వేఱు. అట్లయినను పరదారధనాదుల నపహరింపరాదను సూత్రము మాత్ర మొకవిధముగనే యుండలేదా? అది యెల్లలోకైకవిధముగానున్నది? దాని నెవరైన నాజ్ఞాసమున నుల్లంఘింపఁజూచినచో నాటనే యాదేశనాయకులచేత దండితులు కావుటలేదా? ఈ విషయము నెట్టివానికి నెప్పటికి నెవఁడును మొదటఁగాఁ దెలియఁజెప్పి మంచిత్రోవకుఁ బొమ్మని బోధింపనవసరము లేదుగదా. అనఁగా జనులుతమంతతాము నాయాపట్ల కొన్ని నడవడిక సూత్రములను గొంచెము ప్రపంచజ్ఞాన మలవడుటతోడనే నేర్చికొని యుందురనిగదా దీనిభావము. అట్లయినపుడు ఆసూత్రములు కొన్ని శతాబ్దములకైన బహిర్గతములు కాకపోవునా? అట్లయినవి కొన్ని యేకాభిప్రాయములుగ నైనచో నవి ముందు వెనుకలఁబుట్టి మెఱయు నక్షత్రములవలె స్థిరములై యన్ని దేశములందు మిలమిల మెఱయుచుండక పోవునా? అయితే యీలోకమున భిన్నభిన్నమార్గములఁ బోవువారిని గనుచుండుట లేదాయని నన్ను మీరొక ప్రశ్న నడుగుఁడు. దానికి సమాధానము దేశమునందంతటఁ బ్రతివ్యక్తి దగ్గఱను మంచినడవడిక యున్నదని నాయభిప్రాయముకాదు. కనుకనే యిన్ని వేల నీతిబోధక గ్రంథములు వెలువడవలసి వచ్చినవి. మఱియనఁగాఁ ప్రతి వ్యక్తియు నాయాపట్ల ధర్మాధర్మములను గొన్నిటిని స్వయముగ నెఱిఁగియున్నదనిమాత్రము. వానిని సర్వవిధముల నాచరణములో నుంచుటను గుఱించి యాప్రతివ్యక్తియు నాలోచించునాయనునది వేరువిషయము. కాని కొన్నిసమయములలో నేదైన నొకవ్యక్తి వానిని వెలువఱించుటయు నట్లున్న యంశములు సాధారణముగ నన్నిచోటుల నొకతీరుననే యుంటయు సంభవింపవచ్చునను నిది వెనుకవచ్చిన విషయమే. (సశేషము.)

వీరేశలింగముగారు స్వతంత్రనాటకముల రచనలోను(ధర్మవరం రామకృష్ణమాచార్యులు ఇత్యాదులతోపాటు) తెలుఁగులో మార్గదర్శకులయిరి. నీతిప్రధానమగు కథనే తమరూపకవస్తువుగ నెన్నుకొనుట వీరేశలింగముగారి విశిష్టత. ఆయన 'సత్యహరిశ్చంద్ర నాటకము మననాటకరంగమునకేగాక మనవాఙ్మయమున కంతటికిని నవ్యజ్యోతిని దెచ్చినది. తమజీవితసర్వస్వ మంతను సత్యపరత కర్పించినవారి కథారూపకము నాయన వ్రాయుట సహజమే. ఈనాటకములో నితర విధములను నీతిప్రవర్తనమున కెక్కువ ప్రాధాన్య మీయఁబడినది. ఈయన ప్రహ్లాదనాటకము నిట్టిదే. తండ్రి తన్నెన్నివిధముల బాధించినను దన ప్రాణములఁదీయ యత్నించినను, ఆవిరోధి చర్యలనన్నిటిని 'విశ్వప్రేమ, విష్ణుభక్తి' యను నమోఘాయుధములతో నెదిర్చి, ఆసుర ప్రకృతిని దైవికశక్తి జయించు ననుటకుఁ బ్రత్యక్షనిదర్శనభూతుఁడగు ప్రహ్లాదునికథను దృశ్యకావ్యముగ రచించి, పామరులకును సుబోధమగు వచనరూపము నే యిచ్చి, వీరేశలింగముగా రాంధ్రలోకమున కుపకారకులయిరి. హింసాతత్త్వమునకుఁ బ్రేమతత్త్వముతోను, నాస్తికత కాస్తికతతోను బ్రతివారి హృదయములోను జరుగు సంఘర్షణ మిందులో సరసముగఁ జూపఁబడి, సమయోచితమగు హేతువాదముగల్గి, తుదకుఁ బ్రేమాస్తికతలకు జయము సమర్థింపఁబడినది.

పంతులుగారి 'దక్షిణగోగ్రహణ'మను నాటకము వీరరసప్రధానము. దీనిలో సదనువెంబడిని నీతిప్రవర్తన ముగ్గడింపఁబడినది. ఆయన వ్రాసిన కేవలవచననాటకములలో 'వివేకదీపిక' విధవావివాహము సంఘక్షేమమున కావశ్యక మని ప్రతిపాదించునది. 'బ్రాహ్మవివాహము' చిన్న బాలికలను ద్రవ్యాశచే వృద్ధులకుఁ బెండ్లిచేయుట సంఘమునకెంత యనర్థకరమో తెల్పునది. ఇట్లే 'వ్యవహారధర్మబోధిని'లో నిప్పటికోర్టుకేసులు సాగించుటలోను దీర్పులు జరుగుటలోను కక్షిదారులకుఁ గలుగుచున్న వివిధబాధలు, ఉద్యోగుల లంచగొండితనమును, స్వార్థపరుల చర్యలును

సంఘమున కెట్టికష్టముఁ దెచ్చిపెట్టుచున్నవో పంతులుగారు చూపిరి; ఇట్లే, 'మహారణ్యపురాధిపత్యము, తిర్యగ్విద్వన్మహాసభ, మూషకాసుర విజయము' అను మూఁడు వచనకథలనుగూడ వ్రాసి చిత్రపటములతో రమ్యముగ ముద్రించిరి. ఇందలి పాత్రలన్నియు జంతువులు. మహారణ్యపురాధిపత్యమున రాత్రి నక్క చీకటితప్పుచేయఁబోయి నీలికుండి లోఁబడి యారంగు తనకు దేవతలు స్వర్గమునఁ బ్రసాదించిరని తోడి జంతువుల మోసగించి యరణ్యరాజ్యమునకుఁ బ్రభువుకా యత్నించి, తనసహజచర్యవలన నిజభావము వెల్లడికాఁగా, పులి వాతఁబడి మరణించిన కథకలదు. కామధేనువు మరణింపఁగ, ఆశవమునకు ఖననము కావలెనని కొన్ని, దహనము కావలెనని మఱికొన్నిజంతువులు తమవిద్వత్తను జూపుచు వాదించి చిక్కులఁబెట్టుట తిర్యగ్విద్వన్మహాసభలోఁ జిత్రితము. ఇవి యన్నియు నప్పటి కొందఱు ప్రముఖుల దురాచారములను నిరసించుట కన్యాపదేశముగ వ్రాయఁబడిన వచననాటకములని సూచన కలదు.

అట్టిశైలిలోనే వీరేశలింగముగారు మఱికొన్ని ప్రహసనములఁగూడ రచించిరి. వీనిలోఁ గొన్ని యాంగ్లమునుండి యనువదింపఁబడినవి. ఇందు, అపూర్వబ్రహ్మచర్య ప్రహసనములో రమాకాంతంపంతులు స్త్రీలోలుఁడై దననౌకరుభార్యను వలచుట, ఆమె నాతని దృష్టినుండి తప్పించుట కానౌకరు బ్రహ్మచారివలె నటించును. విచిత్రవివాహ ప్రహసనములో వివాహమాడ నని శపథముపట్టిన స్త్రీద్వేషియగు ధనకోటిరాజను వకీలునొద్ద కొకస్త్రీకక్షిదారువచ్చి తాను వలచిన పురుషుఁడొకఁడు కలఁడనియు నతనిని వశపఱుచుకొని వివాహమాడుటకు యుక్తికావలెననియు కోరును. ఆమె కాతఁ డిచ్చిన వకీలుసలహాప్రకార మాయుక్తి నామె యాతనిపయిననే ప్రయోగించును. ఇట్లీ లాయరుతనమంత్రమునకుఁ దానే గురియై, తికమకలోఁబడి, తుదకు స్త్రీలఁ గూర్చి తనభావము మార్చుకొని యామెను బెండ్లియాడును.

'మహాబధిరప్రహసనము' లో ధనపాలుఁ డనులోభి మూర్ఖుఁడు తన తత్త్వమునకు సరిపడని యొకసుందరిని బెండ్లియాడఁదలఁచును. ఈ కాఁబోవు వధూవరులసమావేశములో విజయవర్మయను బంధువు హఠాత్తుగఁ బ్రవేశించి, వట్టి చెవిటివానివలె వారిమధ్య నటించు మనే వ్యతిరిక్తతత్త్వపు వారి వివాహము సుఖకరముకా దని తోఁపింపఁజేసి, వా రాపెండ్లి మానునట్లుచేసెను. దంపతులసుఖము ముఖ్యము కనుక అనుకూలముకాని సంబంధము చెడగొట్టుట సవ్యమని యందు సూచితము. (ఎట్టిదైనను బెండ్లిని చెడఁగొట్టకూడ దను భావన కిది వ్యతిరిక్తము.) 'పునర్స్మరణప్రహసనము' లో దృఢవ్రతుఁ డను నతఁడు పరధ్యానములో నుండుచు పరాకుచర్యలఁ జేయుచు, తనపొరపాటువలన తనదాసి మరణించినదని రెండుసార్లు భ్రమించి, కలవరపడును; తుద కతనికి లోకజ్ఞానముగలిగి, బంధువివాహముతో శుభాంత మగును. 'బలాత్కారగానవినోద ప్రహసనము' లో గానప్రియుఁడు మంచి సంగీతమునకై చెవిఁ గోసికొనుచు, గానసిధియగువిశ్వపతిశాస్త్రిని రప్పింపయత్నించును; ఆయన ఏలూరునుండి పడవలో పిఠాపురము పోవుచుండె నని విని ధవళేశ్వరమునుండి యాతనిని నిర్బంధముగ నైనఁ దీసుకరమ్మని భటుల నంపును. వారు పొరపాటున విస్మృతపాత్రుఁడను పిఠాపురపు వడ్రంగిని (శాస్త్రిగా రనుకొని) బలవంతముగఁ దెత్తురు. మంచిగీతములఁ బాడించుటకు గానప్రియుఁ డతనిని నిర్బంధించును; నవకూపవనయగు కుమార్తె నిత్తునని యాశపెట్టును. ఆమె కరగ్రహణమాశించియు సంగీతము రానందున నిరాకృతుఁడై నమేనల్లుఁ డీలోఁగా తంజావూరులో గానప్రవీణుఁడై వచ్చి, రహస్యముగ ప్రక్కగదిలో వేచియుండును. విధి లేక విస్మృతపాత్రుఁడు పాడఁగా, వానిగార్ధభస్వరపు వికృతగీతమునకు రోఁతగల్గినగానప్రియుని ప్రక్కగదినుండిమధురగానముతో మెప్పించి, మేనల్లుఁ డతనికుమార్తెను బొందును. గానప్రియుఁడు తనపొరపాటు గ్రహించి కొద్దిబహుమతితో వడ్రంగినిఁ దృప్తుఁజేసి విముక్తునిఁ జేయును. 'కలహప్రియాప్రహసనము' లో 'సుబ్బమ్మ' పొరుగుజనులలోఁ దగవులు

పెట్టియానందించుచు,తుదకుఁదనవదరుఁబోతుతనమున, కులటాప్రియత్వము వలనఁ దా నేభంగపడును. ఇట్లే మహామహోపాధ్యాయ ప్రహసనములో నిరక్షరకుక్షియగు 'భీముని చమత్కృతి, 'మహావంచకప్రహసనము' లో వంచకాచార్యుని మైరావణప్రవృత్తి, అసహాయశూరప్రహసనములో భీమరాజు నుత్తరకుమారప్రజ్ఞయు వినోదకరములు. ఈరచనలన్నియు నాంగ్లకథల కనువాదములు.

ఆయన స్వతంత్రరచనలగు 'కలిపురుషశనైశ్చరవిలాసము' లో మద్యపానమువలన జనులకుఁగలుగు ననర్థములు, 'వేశ్యాప్రియప్రహసనము'లో గణికాలంపటుల పాట్లు, 'కౌతుకవర్ధని' లో లంచగొండితనము వ్యభిచారవృత్తివలనఁగల్గు హాని, వినోదతరంగిణిలో వితంతువుల నిర్బంధవైధవ్యముచే సంఘమునకుఁగలుగు బాధలును, హాస్యసంభాషణలలో నాటకకథారూపముగ వివరింపఁబడినవి. ఇట్టి హాస్యకథల నింకను నెన్నిటినో వ్రాసి యాయన పత్త్రికలలోఁ బ్రచురించెను.

ఆయన వచనవాఙ్మయము నింకను వృద్ధిఁజేసెను. ఇప్పటికి నిల్చియున్న మనదేశపుఁ బ్రాచీనవాఙ్మయములోఁ బద్యగ్రంథములే హెచ్చు. అందులకుఁ గారణ మున్నది. పూర్వ మచ్చుకూటములు లేవు. మఱియు పరిశుద్ధతకై గురువులయొద్ద ముఖతః విద్యనభ్యసించుట సంప్రదాయము. వచనగ్రంథములకన్నఁ బద్యరచన లెక్కువ సులభముగ కంఠస్థమై జ్ఞప్తిలో నుండునుగదా ! పూర్వపురుషులు వచనములో వ్రాసినను తఱుచు క్లుప్తపఱిచి నిగ్గుఁదేల్చి, సూత్రవాఙ్మయము రచించిరి. కాని, ఇప్పు డాపరిస్థితి మాఱినది. అచ్చుకూటముల సౌకర్యములు, కాగితములవాడుక, సామాన్యజనులలో లౌకికవిద్యావ్యాప్తియుఁ గలిగినవి. జ్ఞప్తికై బాధపడ నక్కఱలేదు; ఇట్లు స్థితిమాఱినను తెలుఁగులో మంచి వచనవాఙ్మయము లేకుండుట శోచనీయమని నెంచి, ఆలోపమును వారించుట ప్రజాక్షేమమున కావశ్యకమని వీరేశలింగముగారు గ్రహించి, అదరిమిలాను

గద్యరచనలకే తనలేఖినినిఁ జాలవఱకుపయోగించి, ఆధునికాంధ్రమున సులభమై నిర్దుష్టము పటువునగు వచనవాఙ్మయమునకు మార్గదర్శకుఁ డాయెను. వచన వాహినిని సర్వతోముఖముగ నడిపించుట కాయన యెట్లు మార్గదర్శకుఁ డాయెనో మన మిఁక గమనింతము.

ఆంధ్రవాఙ్మయములోని మొదటి నవల వీరేశలింగముగారి '<u>రాజశేఖరచరిత్రము.</u>' నవల యన పెద్ద చిత్రకథను వినోదకరముగ వివరించు వచనాఖ్యాయిక. ఆంగ్లవాఙ్మయములో నిట్టివి 18 వ శతాబ్దినుండి చాల వెలువడినవి. ఆ శతాబ్దిలో 'గోల్డుస్మిత్తు' అను ధీమంతుఁడు, విశాల హృదయుఁడునగు ఐరిషుకవి రచించిన Vicar of Wakefield నకిది యనుకరణ మని పంతులుగారు స్వీయచరిత్రములోఁ దెల్పిరి. దానితోఁ బోలికయున్నను, ఇది స్వతంత్రనవలయే. తఱుచు నవలలలో ననేకములు కేవలశృంగారభరితములు గృహస్థవిషయములతో నిండినవి; కొన్ని చారిత్రకములు, కొన్ని యపరాధపరిశోధనరూపములు; కొన్నింటిలో రాజకీయములు, సాంఘికార్థికములును ప్రముఖముగ నుండును. ఈనవల 200 సం॥ల క్రిందటి మన ప్రాంతపుజనుల యాచారవ్యవహారములఁ జిత్రించును.

ఇందలి ముఖ్యపాత్రయగు రాజశేఖరుఁ డను బ్రాహ్మణుఁడు మొదట సంపన్నగృహస్థుఁడు. అతఁడు ధవళేశ్వరములో స్వగృహమున సాంప్రదాయికజీవనమును గడిపెను. దుర్వృత్తులు లేకున్నను ఈయన పామరులఁ జేరనిచ్చి, వారి ముఖస్తుతులకులోనయి, వారికి విరివిగ దానములఁ జేయుచు, సంప్రదాయ మని తనస్థితికిమించునట్లు దుబారా ఖర్చులఁ జేయుచు, ఋణములపాలై, పైతృకసంపత్తునంతను క్రమముగ నుత్తమర్ణుల కొప్పగించి, రిక్తహస్తుఁడాయెను. అంతవఱ కాప్తులైనట్లు నటించి యుపకారులైనవా రిప్పు డుదాసీనులై, పై పెచ్చు వ్యతిరేకులైరి. అక్కడ తగువృత్తి లేకుండెను. పువ్వులమ్మినయూరఁగట్టె లమ్ముటకష్టము. రాజశేఖరుఁ డంతట సకుటుంబముగ రాజమహేంద్రవరముఁ జేరి,అందుండి

రాజానగరముద్వారా పెద్దాపురముదారిని తీర్థయాత్రకని బయలుదేరును; అప్పటియడవులదారిని నల్లజర్ల సమీపమున దొంగలచే భంగపాటు నొంది, ఇంక నెన్నియో దుర్ఘటనలపాలై, తుద కెట్లో పెద్దాపురమును, చామర్లకోటను జేరును. తనకుమారుఁడు చెదిరి పిఠాపురములో నుండెను. అప్పటి యా సంస్థానములస్థితి, రాజశేఖరుని కుమార్తె రుక్మిణికి దారిలో ప్రమాదమును, దొంగలచే మరణించె ననుకొన్నరుక్మిణి పెద్దాపురమురాజుగారి ప్రజ్ఞాసాహసములచే రక్షింపఁబడుటయు, ఆమె సుబ్బారాయఁ డనుపేర (దొంగలనుండి తప్పించుకొన్న చెల్లెలితో సహా) పెద్దాపురపుఁబ్రభువువారి సహాయముతో మరల రాజశేఖరుని గలసికొనుటయు, రాజుగారి యనుగ్రహముననే పిత్ర్యపుభూములు బాకీదారుల నుండివిడిపింపఁబడి రాజశేఖరుఁడు పొందుపున్నే సుఖించుటయు నిందలి యితివృత్తము.

మన హిందూకుటుంబముల జీవనపద్ధతులు, అందలి లోపములు, గ్రహములు, దయ్యములు గ్రహణములు ఇత్యాదులఁ గూర్చి పామరులలో వ్యాపించియున్న మూఢవిశ్వాసములు, సాంఘికదురాచారములును, కన్నులఁగట్టిన ట్లిందు సందర్భోచితముగ వర్ణింపఁబడినవి. గోదావరీనది, నిబిడారణ్యము, ఇత్యాది ప్రకృతిదృశ్యములును, పూర్వపుఁ బ్రయాణపద్ధతులు, సత్రములు, గ్రామజీవితము, జమీందారీసంస్థలును స్వభావోక్తితో వర్ణింపఁబడినవి. ఆయాపాత్రల స్వభావపరిణామమును జిత్రింపఁబడినది. పెద్దాపురపు రాజుగారు గూఢచారపద్ధతి నవలంబించి, సాహసియై దొంగలజాడ లర్ధరాత్రిని స్వయముగఁ గనిపెట్టి, దుష్టుల నిగ్రహించును. ఈనాఁటి కొన్ని నవలలలోవలెఁ బాఠకుల కుద్రేకము గల్గించు అతిశయోక్తులు, వెఱ్ఱి శృంగారవర్ణనలు నిందులో లేవు. తీవ్రరుచులఁగోరు పాఠకులు దీనిని మెచ్చుకొనుటలేదు. కాని సౌమ్యజీవితము, సత్ప్రవర్తనమును, పరిశుద్ధాచారములును, సంఘమునకు క్షేమకరము లని స్ఫురింపఁజేయు సంఘటన లెన్నియో

యీ రాజశేఖరచరిత్రములోఁ గలవు. ఇది కొంద ఱాంగ్లవిద్వాంసుల దృష్టి నాకర్షించి, కొన్ని యితర భాషలలోని కనువదింపఁబడినది. Fortune's Wheel అనుపేర దీనియింగ్లీషు తర్జుమా లండనులోఁ బ్రచురితమై టైమ్సుపత్రికచే గూడ శ్లాఘింపఁబడినది. ఆంధ్రకవులలో నిట్టి గౌరవము వీరేశలింగముగారికే లభించిన దని చెప్పవచ్చును.

ఆయనవ్రాసిన '<u>సత్యరాజా పూర్వదేశయాత్ర</u>' మఱొక విచిత్ర కథాగ్రంథము. తెలుఁగులో నట్టిగ్రంథము మఱియొకటి లేదు. 18 వ శతాబ్దిలోఁ 'గాశీయాత్ర' అను పేర మద్రాసువాసియగు శ్రీ యేనుగ వీరాస్వామయ్య వచనగ్రంథము వ్రాసెను. అది యిటీవల మరలఁ బ్రచురితమైనది. కాని యది యథార్థప్రయాణము వివరించు యాత్రా పుస్తకము, అప్పటి మనదేశీయుల స్థితిగతులనుఁ దెల్పునది. ఈపుస్తకము నందలి భావములు నుద్దేశమును వేఱు. ఇది సంఘవిమర్శకై వ్రాసిన కల్పితకథ. ఆంగ్లమున Swift అనుకవి Gulliver's Travels అను గ్రంథమును వ్రాసెను; అందులో నాంగ్లేయుల సంస్థలలోను నాచార వ్యవహారములలోనుగల కొన్నిలోపములఁ జూపుటకై కేవలం మఱిగుజ్జు జనులుండు దేశమునకు, బకాసురులుండు దేశమునకు వరుసగ నొకఁడు వెళ్ళినట్లును, అక్కడి విచిత్రానుభవములను వెల్లడించినట్లును, చెప్పఁబడినది. అట్లే యిందు సత్యరాజాచార్యులను యాత్రికుఁడు ఆడమళయాళమునకును, లంకాద్వీపమునకును వెళ్ళినట్లు వ్రాయఁబడినది. ఇది కల్పితకథయైనను, ఇదినిజముగనే జరిగెననియు, అట్టిదేశము లిప్పుడున్న వనియు కొందఱిప్పుడును భ్రమించుటఁబట్టి మనరచయిత ప్రజ్ఞ వెల్లడియగుచున్నది.

ఒకేనరుఁడు తనసంచారానుభవములను స్వయముగఁ దెల్పినట్లుండు వ్రాయఁబడినది. కనుక, ఇప్పటిమామూలు నవలల పోకడకిది భిన్నమే; కాని, విచిత్రకథగల కల్పితగాథ, చాలవినోదకరము; అన్యాపదేశముగ సంఘదోషములను బాఠకులకుఁ జూపుట మనకవికి ముఖ్యోద్దేశము. యథార్థపు మళయాళము మనమద్రాసు రాష్ట్రపు నైఋతిభాగపుది

మళయాళస్త్రీలకు మనయితర ప్రాంతీయులకన్న సాంఘికముగ నెక్కువ స్వేచ్ఛయు, ఆస్తివ్యవహారములలో నెక్కువ హక్కును గలవు, నిజమే. కాని మనకవి చిత్రించిన 'ఆడమళయాళము' లోకాతీతము; ఈయూహాప్రపంచములో నుద్యోగములు, అధికారము, వ్యాపారములు సాధారణముగ స్త్రీలవే; పురుషులో! ఇంటవంటఁజేసి గృహకృత్యములు నిర్వర్తింతురఁట. ఆస్త్రీ లెందఱో పురుషులతో నొకేసారి భార్యగఁ గాపురము చేయవచ్చు. భార్యపోయిన పురుషులు దుస్సహమగు 'వైధురము' లో నుండవలె. అనఁగా వారికి పునర్వివాహము, అలంకారమును గూడదు. బ్రహ్మచర్యమవలంబించి, రోజుకొకేసారి భుజించి విధురత్వసూచకముగఁ గల మీసము గొరిగించుకొని పై పెచ్చు ముక్కు కత్తిరించుట యాచారమఁట ! ఇంట చాకిరి చేయుటలో నెట్టిలోటువచ్చినను, భార్యలు తమ భర్తలను శిక్షింతురు. భార్యగలపురుషు లెప్పుడును క్షౌరము లేకుండ తల దువ్వుకొని సుందరులగుట కలంకరించుకొందురు; భార్యపోవఁగనే భర్త సహగమనము చేయుట యక్కడ సదాచారమఁట. అందులకు స్త్రీలు కారికలు శాస్త్రప్రమాణములఁజూపుదురు. విద్యాస్వేచ్ఛగలపురుషులు భ్రష్టులు దురాచారులుగఁ నెంచఁబడుదురఁట. ఇట్టి సంస్కరణఁ జేయఁ బూను స్త్రీలు తక్కిన స్త్రీల హేళనకు నిందకు పాత్రలగుదురఁట. పురుషస్వాతంత్ర్యోద్యమ మిటీవల బయలుదేరినది; కాని దానిని తఱుచు స్త్రీలు ఖండించి యణఁపయత్నింతురఁట అక్కడి యిట్టి పురుషులస్థితి దుస్సహమని వెంటనే మనకుఁదోఁచును. కాని, ప్రకృతిలో స్త్రీపురుషులు సమానులు, అక్కడి పురుషులస్థితిలోనున్న యిక్కడి స్త్రీలస్థితియు హీనము; కనుక వారిని వెంటనే యుద్ధరించి యున్నతికిఁ దెచ్చుట యిక్కడి పురుషులందఱివిధియని చదువరులహృదయములో నాఁటునట్లు చేయుట కవి యుద్దేశమని స్పష్టము. స్వానుభవపు భావన కల్గినప్పుడే అన్యాయము బోధపడి నాఁటును. శ్లో. 'నత త్పరస్య కుర్వీత యన్న ఆత్మన ఇచ్ఛతి'

ఈగ్రంథపు రెండవభాగము 'లంకాద్వీపము'. ఇప్పుడున్న 'సింహళలంక'కాక భీకరదేహముగల్గి నరాశనులు చరించు 'లంకాద్వీప'మింకను దక్షిణమున నెక్కడనో కల దనికొంద ఱనుటకలదు. ఆభావమును మనకవి దీనిలోనుపయోగించెను. ఈకథలోనిలంకలోజనులందఱును బకాసురులు. వారిలోఁజిన్నవారును మనకు చాలరెట్లుందురు; అక్కడిచీమ మనయెలుక యంత, పంది మన యేనుఁగయంతయు నుండును; ఇట్లే, అక్కడి చిన్నచెట్లు చేమలు మహావృక్షములుగ నుండునని, జనులకంఠధ్వని పిడుగువలెఁగఠోరముగనుండునని చెప్పఁబడినది. అక్కడ పూర్వాచారమం దభిమానము హెచ్చు, కనుక లంకావాసుల పూర్వపునరాశనత్వము, క్రౌర్యము, ఇత్యాదులనక్కడిరాజగు విభీషణుఁడు సంస్కర్తయై మాన్పించినను, అవిసదాచారములని యక్కడి పూర్వాచారపరులు భావించిరఁట. 'పురాణమిత్యేవ నసాధుసర్వం నచాపిసర్వం నవమి త్యవద్యం' అను కాళిదాసవచనపు సత్యమును సూచించుట కిచటఁగవి యత్నించెను. అక్కడి వికృతరాక్షసజనుల మధ్య మనసత్యరాజు సూక్ష్మదేహులని పురాణములలోఁ జెప్పఁబడిన వాలఖిల్య ఋషులవలె నుండెనఁట. ప్రమాదము తప్పుట కితఁడు మహాకాయుఁడను రాక్షసుని రక్షణలో పంజరములో నుంచఁబడెను. ఈవిచిత్రఋషిని జూడఁ జనులు విఱుగఁబడుచుండిరఁట. తండోపతండములుగ జనులువచ్చి తమ కపూర్వముగఁ దోఁచు నీసత్యరాజదర్శనము చేయునప్పుడు చాలసొమ్ము కానుకలు ముడుపులుగ జెల్లించి పాపములు పోయినవని తృప్తులయిరఁట. ఈ వాలఖిల్య మహత్త్వమును గోరంతను కొండంతగఁబొగడి ప్రకటించి యజమానియగు మహాకాయుఁడు మహాధనికుఁడాయెను. ఇట్లు మనదేశములో పామరుల మూఢవిశ్వాసములఁ బెంపొందించి యమాయికులకష్టార్జితద్రవ్యము నాకర్షించువారి కొన్ని చేష్టలు కొన్ని దేవాలయాదుల ధర్మకర్తలచర్యలు నపహాసింపఁబడినవి. అక్కడి తగవులు వ్యవహారములుగూడ న్యాయశాస్త్రమునకు బదులు జ్యోతిశ్శాస్త్రకారికల ద్వారానే పరిష్కరింపఁబడునఁట. ఈపరిష్కర్తలు కొత్త

కారికలుగూడ సమయోచితముగ సృజించి వాడుదురఁట; కనుక వారికి లంచమిచ్చువారికే లాభించి, ధర్మమునకుబదులు ద్రవ్యము కుట్రయునే జయసాధక మగుచుండెను; ఇప్పటి ఫలితజ్యోతిషమందు విశేషవిశ్వాస ముండుటవలన సంఘమున కనర్థమునవినీతియు నెట్లువిస్తరించునో అట్టిజ్యో తిషప్రచారమునఁ బ్రజలెట్లు మోసపోదురో, తన భావముల నిందులోఁ గవి సూచించెను.

అక్కడి యొక ధర్మశాస్త్రసభ కధ్యక్షుడై యున్న మన 'వాల ఖిల్యుఁడు' చర్చలో ధర్మపక్షపు 'దీర్ఘరోము' నివాదనే న్యాయ్యము సహేతుకము నని గ్రహించును; కాని సభలో హెచ్చుమంది పూర్వా చారపరులు, జ్యోతిశ్శాస్త్ర పక్షపాతులునని యాతఁడు గ్రహించి, ప్రజా భిమానము చూఱఁగొనుటకై ఫలిత జ్యోతిషపక్షము వారికే యనుకూ లముగఁ దన తీర్పునిచ్చి, సభవారి మెప్పును సంపాదించుకొనెనఁట. సంఘక్షేమమునకు సంబంధించువిషయములం దిట్లు పండితమ్మన్యులు గతానుగతికులై పేరు ధనాదిలాభమునే ముఖ్యముగఁ జూచుకొని, అంత రాత్మలోఁ దమకు సంఘమునకు వ్యతిరిక్తమని తెలిసిన భావములఁ బ్రక టించుటకలదని, అందుచే సంఘమునకు హాని జరుగుననియు, స్ఫురించును. వీరేశలింగముగారు భావగర్భితముగ వ్రాసినయిట్టి కథ లింక నెన్నియో కలవు. ఇవియుఁ జాలవఱ కనుభవమునుబట్టి యిప్పటి కొందఱి సాంఘిక మత్సర్యలను నిరసించుచు నన్యాపదేశముగ వ్రాయఁబడినవి.

బాలురకుపదేశించు చిన్నవచనకథ లాంధ్రమున నప్పటికి లేవు. ఆలోపమును దీర్చుట కాయన యప్పుడప్పుడు నీతిబోధకమగు చిన్నకథ లనుగూడ వ్రాసిరి. ఈ సందర్భమున వారి విగ్రహసంధితంత్రములను, నీతికథామంజరినిగూడ మనము స్మరింపవలెను. పూర్వము పాలీ సంస్కృ తములలో నీతిని బోధించు నిట్టి కథ లనేకములుండెను. అట్టి పూర్వ కథావాఙ్మయములో ముఖ్యమయినది 'పంచతంత్రము.' (ఈ కథావా ఙ్మయములోఁ గొంత గ్రీకులద్వారా, యూరపునకు వ్యాపించి, పిమ్మట

యీసప్స ఫేబిల్స్' మున్నగు నిప్పటి బాలవాఙ్మయమున కాకరమయి నది ) పంచతంత్రములోఁ గొంత చిన్నయసూరిగారిచే నాంధ్రీకరింపఁ బడినది. కాని దాని శైలి బాలురకుఁజదువుటకు వీలుగ లేదు. అంతకన్న సులభముగ విగ్రహసంధిభాగములను వీరేశలింగముగా రనువదించిరి. ఇట్లే 'నీతికథామంజరి'యను పేర కొన్ని నీతిబోధకమగు చిన్నకథలను చిన్నవిద్యార్థులకు సుబోధక మగునట్లు వ్రాసి, ఆయాపాత్రలచిత్రపట ములతోపాటు ప్రచురించిరి. ఇట్లే బాలుర కర్థమగున ట్లాయాకథలకుఁ దుదను జక్కని చిన్నచిన్న పద్యములనుగూడఁ జేర్చిరి.

ఆంధ్రములో వైజ్ఞానికగ్రంథము లసలే లేకుండెను. ఆధునిక విజ్ఞానము-అందు ముఖ్యముగ భౌతికవిజ్ఞానము-దేశభాషలలో వ్యాపిం చుట మన సంస్కృతివికాసమునకు సాంఘికాభివృద్ధికిఁగూడ నత్యావశ్య కము.

ఇప్పటి భౌతికవిజ్ఞానము సామాన్యజనులకుఁ దెలియకుండుటవలన వారిలో మూఢత్వమును దురభిప్రాయములును వ్యాపించి, ప్రగతి కాటం కము గల్గించుచున్నవి. కనుక స్వభాషలో వైజ్ఞానికరచనలు కావలెను.

ఇప్పటి భౌతికవిజ్ఞానముఁగూర్చిన పారిభాషికపదములు లేక మన దేశభాషలలో నట్టి వాఙ్మయము లేర్పడుటలేదని గ్రహించి, ఆయన యీయాటంకమును గొంచమైనను బోగొట్టఁదలఁచి, నవ్యపదజాలము తోఁ గొన్ని శాస్త్రగ్రంథములను వ్రాసిరి; మొదట పదార్థవిజ్ఞానశాస్త్ర మును వ్రాయఁదొడగిరి. కాని దానిని కారణాంతరమునఁ గొంతలో విడ చిరి; అంతట Huxley's Physiology ఆధారముమీఁద శారీ రక శాస్త్రమును వ్రాసిరి; ప్రతివారును దమ దేహనిర్మాణమును దేహాంగములచర్యలఁ గూర్చియుసరిగాఁదెలుసుకొనుటయారోగ్యరక్షణకు వైద్యచికిత్సాజ్ఞానమునకు నవసరము; ఇట్లే తక్కిన ప్రకృతిశాస్త్రజ్ఞాన మును; కాని ఆ గమనిక లేకయు, మన దేశభాషలలో వైజ్ఞానికపదము లులేకయు వైజ్ఞానిక గ్రంథములరచన జరుగలేదు.

ఈశాస్త్రీయగ్రంథరచన కాయన తగుసామాగ్రిని సేకరించుట కాంగ్లగ్రంథములతోఁ దృప్తినొందక సంస్కృతములోని చరకసుశ్రుతాది వైద్యగ్రంథములఁ జదివి, అందలి ముఖ్యభావములను సిద్ధాంతములను వీలైనంతవఱ కాధునికవిజ్ఞానముతో సమన్వయించి, తనగ్రంథములో వ్రాసెను; పూర్వపుసంస్కృతపారిభాషికపదములను విరివిగ నిందు వాడెను. విజ్ఞానవిషయము క్లిష్టమయినను దనగ్రంథము సుబోధమై చదువ నింపగునట్లు సులభశైలిలో వ్రాయుటేకాక, పాఠకుల కాయావిషయము లవగాహన యగుటకై యాయా దేహాంగముల నిర్మాణము తెలుపు దిమ్మలనుజాలవ్యయప్రయాసలకోర్చి వైజ్ఞానికముగస్పష్టపఱుచుచుఁ దయారుచేయించి, వాటిచిత్రపటములనుగూడ చేర్చి ముద్రించెను. ఇందుపయోగించిన కొన్ని వైజ్ఞానికపదము లిప్పటిసామాన్య పాఠకులకు కొత్తగనుండును; కనుకఁ దమభావ మందఱికిని స్పష్టపడుటకై వానియాంగ్లపదముల సూచికనుగూడఁ జేర్చిరి. ఆయన జ్యోతిషశాస్త్రసారమును గూడ వ్రాసినారు. ఈపుస్తకమును వ్రాయుటకును వా రెంతో శ్రమపడిరి. ఆయనకు ఫలితజ్యోతిషము (astrology) నందు నమ్మికలేదు, కాని గణితసిద్ధాంతజ్యోతిష (astronomy) ముపయుక్తమగు ముఖ్యశాస్త్రమని యాయన నిశ్చయము. కనుకఁ బరిశోధనఫలమగు జ్యోతిశ్శాస్త్ర గ్రంథము నాంగ్లమందభ్యసించుటేగాక వరాహమిహిర, భాస్కరాదుల సంస్కృత రచనల శ్రద్ధతో నభ్యసించి, సారము గ్రహించి, ఆజ్ఞానమును పరిభాషా పదములనుగూడ పంతులుగారు తమగ్రంథములలో నుపయోగించిరి. గ్రహచలనముగూర్చియు గ్రహణాదుల తత్వము కారణముఁగూర్చియుఁ గొన్నిపురాణములలోఁ జెప్పిన కవివర్ణనలభావములే మన పూర్వుల శాస్త్రీయభావములని మనలోఁ గొందరు విద్యావంతులును నమ్ముచున్నారు. అందువలన జనులలో మూఢత్వము బలపడుచున్నదని తోచి, పంతులుగారు జ్యోతిశ్శాస్త్రగ్రంథములలోని వైజ్ఞానికమగు యుక్తసిద్ధాంతములను సహేతుకముగ నిరూపించి, అపూర్వగ్రంథములనుండి ప్రమా

ణవచనముల నుదహరించి, వాడుకలోనున్న పొరపాటుభావములను ఖండించి, వైజ్ఞానికభావములు ప్రాచ్య శాస్త్రసమ్మతములే యని విశద పఱిచిరి.

ఆయన తత్వశాస్త్రగ్రంథములనుగూడఁ గొన్నిటిని దెలుఁగులో రచించిరి. అందొకటి 'తర్కసంగ్రహము.' ఇది షడ్దర్శనములలోని న్యాయ వైశేషికదర్శనముల సారము. నవ్యన్యాయసిద్ధాంతప్రకార మీగ్రంథమును అన్నంభట్టు సంస్కృతభాషలో వ్రాసెను. తర్కశాస్త్రాభ్యాసమున కీగ్రంథ ముపకరించును. దీనిని వీరేశలింగముగారు సులభశైలిలోఁ దెలిఁగించిరి. మన జాతీయసంప్రదాయప్రకారము మతగ్రంథముల నభ్యసించుటకు తర్కశాస్త్రజ్ఞాన మవసరము. కనుక నిది ధార్మికవిద్యకుపయోగకరము. ఆధ్యాత్మికవిషయములఁగూర్చియు నానామతసిద్ధాంతములగూర్చియుఁ జక్కనిశాస్త్రీయచర్చతో పారిభాషిక పదయుతముగ పంతులుగారెన్నియో వ్యాసములను వ్రాసిరి. ఆయనరచించిన 'అలంకార సంగ్రహము'లో నాలంకారిక సిద్ధాంతములు విశదముగ వ్రాయఁబడినవి. సంస్కృతపాండిత్యము లేని యాంధ్రకవికుమారులకుఁ విద్యార్థులకుగూడ నిది యుపకరించునది. ఇందు, అర్థాలంకారములునూఱు (అందలి యవాంతర భేదముల సూచనతోను, ఉదాహరణములతోను దేటతెల్లముగ వివరించినారు; ఇట్లే కొన్ని శబ్దాలంకారములను దెలిపిరి.

ఆయనవ్రాసిన 'కావ్యసంగ్రహము'లో సంస్కృతకవి సమయప్రకారము శబ్దార్థములు, కావ్యవిభజన, గుణములు, దోషములు, భావములు, వృత్తులు, జాతులు, పాకములు, శబ్దాలంకారములు, అర్థాలంకారములు, నాయకాదిలక్షణములును వివరింపఁబడినవి. ఆయన 'సంగ్రహవ్యాకరణము' విద్యార్థిలోకములోఁ సుప్రసిద్ధము. సంస్కృతసంప్రదాయప్రకారము, సంజ్ఞా, సంధి, అజంత, హలంత, క్రియాపరిచ్ఛేదములుగ విభజింపఁబడినవి. వానిసూత్రములు సంస్కృతపండితులకే సరిగ బోధపడును. ఆ యాధారము లేకున్నను దెలుఁగుతత్వమునుబట్టి యాంధ్రవ్యాకరణము నేర్చు

కొనుటకని వర్ణ, పద, క్రియా, వాక్య, కావ్య పరిచ్ఛేదములుగ నమర్చి, తమబోధకతానుభవముతో సులభమగు మాటలతో నుదాహరణ లిచ్చినారు. ఈ గ్రంథములన్నియు యువకులకు శాస్త్రీయజ్ఞాన మల వటిచి వాఙ్మయరచనకుఁ బ్రోత్సహింపఁదోడ్పడినవి.

వీరేశలింగముగారి రచనలన్నిటిలో ముఖ్యము.'ఆంధ్రకవులచరిత్రము' (1893). అంతవఱ కాంధ్రవాఙ్మయచరిత్ర లేదు సరికదా! ఆ యా ముఖ్యకవులజీవితమును గూర్చియు రచనాకాలములఁగూర్చియు నెవరును విశ్వాసార్హమగు గ్రంథము వ్రాయలేదు. (గురుజాడ రామమూర్తి పంతులుగారి కవిజీవితము లప్పటికిఁ బ్రచురితమయినను, అది సాంప్రదాయికముగ పామరులలో వ్యాపించిన కథలతోనే నిండి 'భోజకాళిదాసు' చరిత్రను బోలియుండెను).

మనదేశపుఁబూర్వకవులచరిత్ర వ్రాయుట చాలఁ గష్టసాధ్య మయినది. ఆత్మప్రశంస యిష్టము కాకనో, కావ్యరసానుభూతి కది యవసరము కాదనియో,పూర్వకవులలోఁ జాలమంది తమ్ముగూర్చి తమకాలముఁగూర్చి యెక్కడను జెప్పుకొనలేదు. మొదటిసంస్కృతకవులగు భాస కాళిదాసాదులుగూడ మనదేశమం దేప్రాంతమువారో ఏ శతాబ్దివారో వారిజీవితమెట్లుండెనో(విద్వాంసులెన్ని విమర్శనలఁజేసినను) నేఁటికిని సరిగఁ దేలలేదు. వారు భారతదేశమంతయు సమానముగ భావించియుందురు. కాని యిప్పు డిట్టిపరిశోధన మాధునికవిమర్శకులు చేయుచున్నారు; ఆంగ్లాది పాశ్చాత్య వాఙ్మయమునకు (అందలి ముఖ్యకవులకు విడిగను), సంస్కృతసాహిత్యమునకును,శ్రమపడి చరిత్రలవ్రాసియున్నారు. ఇందువలన నప్పటి సంఘస్థితి భాషాస్థితి కూడఁ గొంత తెలియును. మనయాంధ్రమున కట్టిపరిశోధనకు వీరేశలింగముగారు సంకల్పించిరి. ఇది 55 ఏండ్లక్రిందటి మాట. అప్పటి కిప్పుడున్నన్ని గ్రంథప్రచురణములు లేవు; విమర్శవ్యాసములు లేవు. పూర్వవాఙ్మయపుఁగొన్ని ముఖ్యగ్రంథములునచ్చుపడలేదు. మంచి వ్రాఁతప్రతులును దొరకుటకష్టము. అందులకాయన తంజావూరు

మద్రాసు గ్రంథాలయములలోని ప్రతులఁబట్టి ప్రతులు వ్రాసికొనుటయే గాక శ్రమపడి క్రొత్తతాళపత్రగ్రంథములను, శాసనములను సేకరించిరి. ఇం దుదాహరించినపూర్వకవిప్రశంసలు, కవుల కులగోత్రములు, రాజాంకితములు, శాసనభూదానములు, ఇట్టివాని నెంతయో విచక్షణతోఁ బరిశీలించి, ఆయా కవులస్థలకాలనిర్ణయ మాయన యోగ్యతో చేయఁగల్గిరి. పూర్వకవులఁగూర్చినయైతిహ్యముల నుదహరించి యవి యెంతవఱకు నమ్మఁదగినవో కొన్నిగ్రంథము లా యా మహాకవిరచితము లనువాడుక సత్యమా కాదో యుక్తితోఁ జర్చించుచు, సంప్రదాయమునకు భిన్నమని జంకక, తమనిశ్చయమును ధైర్యముతోఁ దెల్పిరి. మఱియు నాయా కవి వ్రాసిన ముఖ్యగ్రంథముల సారమును, కవిత్వవిశేషమును, భాషాశైలిని దెల్పి, శైలిని గమనించుట కా కావ్యములనుండి కొన్ని పద్యము లుదాహరించిరి. ఈగ్రంథము నాయన మూఁడుభాగములుగ విభజించెను. 15 వ శతాబ్దివఱకు 1 వ భాగము. దీనిలో కవిత్రయము, పాల్కురికి సోమనాథుఁడు, రంగనాథుఁడు, భాస్కరుఁడు, వేములవాడ భీమకవి, శ్రీనాథుఁడు, పోతన, పిల్లలమఱ్ఱి వీరభద్రకవి ఇత్యాదుల ప్రశంస కలదు. సంస్కృతపురాణేతిహాసమహాకావ్యములు హెచ్చుగ నా కాలమం దాంధ్రీకరించిరి; కనుక, ఇది యనువాదయుగ మనుట కలదు. అప్పుడు కొన్ని వ్యాకరణములును రచింపఁబడినవి. మధ్యయుగములో పెద్దన, ధూర్జటి, తిమ్మన, భట్టుమూర్తి, రామభద్రుఁడు, పింగళిసూరన్న, శంకరకవి, రామకృష్ణాదులును జేరిరి. వీరు స్వతంత్రమగు చంపూప్రబంధముల రచించిరి. (ఇతివృత్తములు పురాణాదులనుండి తీసికొన్నను, ఇవిస్వతంత్రగ్రంథము లనుటయే భావ్యము. కళాపూర్ణోదయాదులలోని కథ కల్పితము.) ఈప్రబంధములలోని భావనలు, కవిసమయమునకు లోఁబడి మంచి కల్పనాంశములతోను జక్కని యలంకారములతోను మనోహరమగు క్రొత్తవర్ణనలతోను పటువైనను గటువుకాని శైలితోను

వ్యక్తిత్వముతోను నలరుచుఁ బేరుగాంచినవి. అప్పుడు కొందఱలంకార గ్రంథముల రచించిరి.

ఇటీవలి 200 ఏండ్ల లోపలరచించిన గ్రంథములను పంతులుగారు మూఁడవయుగములోఁ జేర్చిరి. ఈ యుగపు రచనలు సాధారణముగ స్వతంత్రభావములులేక చాలవఱకు పూర్వరచన కనుకరణములని, పైపెచ్చు శైలీకాఠిన్యము హెచ్చి, రచనలు వికృతముగు నతిశయోక్తులతోను వ్యర్థపదాడంబరముతోను నిండినవని, ఈ వాఙ్మయము చాలవఱకు నిరర్థకమని, పంతులుగా రాశ్చర్యముదెల్పి విమర్శించిరి. కాని యందులకాశ్చర్య మక్కఱలేదు. వాఙ్మయము తత్కాలపు సాంఘికజాతీయ జీవితమునకుఁ బ్రతిబింబ మగుట సహజము గత 200 సం॥లలో మనజాతీయ జీవితమువలె, వాఙ్మయమును వికృతినొంది హీనస్థితికివచ్చుట సహజమే; ఇట్టి పరిణామ మీదేశమందన్ని ప్రాంతములలోను గల్గినది. ఈ 3 వ యుగములోను గొన్నియనువాద గ్రంథములు వ్రాయఁబడుచునే వచ్చినవి. వివిధవ్యాపృత్తులమధ్య వీరేశలింగముగా రిట్లో యాంధ్రకవుల చరిత్రను వ్రాసి ప్రచురించిరి. ఇట్టి మహావిషయముఁగూర్చిన ప్రథమరచనలో లోపము లుండుట సహజము. క్రొత్తపరికరములు దొరకినంతట తమ 'ఆంధ్రకవుల చరిత్రము' లోఁ గొన్నిమార్పులు చేయఁదగునని యాయన కనిపెట్టి, యా గ్రంథమును సవరించి వృద్ధిచేయ సంకల్పించి, శ్రమపడి ఈ 30 ఏండ్లలో దొరకిన క్రొత్తయంశముల నుపయోగించి, మొదటి భాగము నట్లు సంశోధించి ఆయన వార్ధకములో మరలఁ బ్రచురించిరి; దాని నాంధ్రభాషను నాంధ్రవాఙ్మయవృద్ధికిని మహోపకారము చేయుచున్న శ్రీ పిఠాపురం మహారాజావారి కంకితము చేసిరి; ఇది యెంతయుఁ దగియున్నది. మిగిలిన రెండుభాగములుగూడ సంశోధించుచుండఁగనే వార్ధకము వ్యాకులత వృద్ధియై 1919 లో నాయన మరణించెను. ఈ గ్రంథములోఁ గొందఱుకవుల కాలనిర్ణయము చేయుటలో నాయన కొందఱాంధ్ర రాజులఁగూర్చియు కొన్నిప్రాంతములఁగూర్చియు చారిత్రక చర్చ గూడఁ జేసిరి. (ఉ: నన్నయ చరిత్రలోఁ దూర్పు చాళుక్యరాజులఁగూర్చి, శ్రీనాథచరిత్రలో రెడ్డిరాజులఁగూర్చి, దిట్టకవి నారాయణకవి చరిత్రలో

బొబ్బిలి విజయనగర రాజులఁగూర్చి.) అప్పటిస్థితినిబట్టి పంతులుగారు దీని రచనకెంతయో శ్రమపడి తమధీశక్తిని బాగుగ నుపయోగించిరి. ఈగ్రంథములోఁ గొన్నిలోపముల నిటీవలఁ గొందఱు విమర్శకులు చూపిరి. కాని, అందలి ముఖ్యసిద్ధాంతములు మాఱక స్థిరపడినవి. మఱియు, మార్పులును జాలవఱకుఁ దరువాత దొరకిన శాసనాదుల యాధారమునఁ గల్గినవే. తరువాతవచ్చిన కొన్ని వాఙ్మయచరిత్రలకును విమర్శక వ్యాసములకును నీకవులచరిత్ర ముఖ్యాధారమయినది. కనుక దీనిఘనత కెట్టిలోటును గలుగలేదు.

వీరేశలింగముగారు రచించిన తుదిగ్రంథము 'స్వీయచరిత్రము.' ఈయాత్మకథలోఁ దనజీవితపుముఖ్యవృత్తాంతముల నాయన (రెండు భాగములుగ) వ్రాసిరి. ప్రజాహితపరుల చరిత్రనుండి నేర్చుకొనఁ దగిన విషయము లనేకము లుండును. బాల్యమునుండి సాంఘికదురాచారములఁ బోఁగొట్టుటకు, జనుల ధార్మికోన్నతికి, విద్యాబోధకు, వాఙ్మయవృద్ధికిని దమ జీవిత మర్పించి నూతనచైతన్యము గల్గించిన యీనీతివర్తనుజీవిత కథ యుపకారకమగుటసహజమే. ఆంధ్రమం దప్పటి కట్టి చరిత్ర లరుదు; ఆత్మకథ యసలే లేదు. ఎవరి జీవితవార్తలు మనోభావము వారికే బాగుగఁ దెలియును. మనఃప్రవృత్తిలోని యాంతరికపరిణామముల కాత్మకథయే ప్రమాణమగును. కాని యెవరిచరిత్రను వారేవ్రాయుటలోఁగొన్నిప్రత్యేకపుబాధలుండును. ఏవృత్తాంతములు వెల్లడించిజనులకుఁ దెలుపఁదగినవో యేవిజనోపయోగకారులో విచక్షణకావలెను. ప్రతిపక్షనిందయు నాత్మశ్లాఘయు లేకుండను, అంతగా నైచ్యానుసంధానము లేకుండను వ్రాయఁగల నిగ్రహముకావలెను. తమకాలపు విషయములతోపాటు కొందఱు సమకాలికులఁగూర్చియు సంస్థలఁగూర్చియు వ్రాయుట తప్పదు. సత్యన్యాయపరత ముఖ్యావశ్యకము. ఆయనకు సాంఘికయుద్ధములలోఁ జాలమంది ప్రతిపక్షు లేర్పడిరి; ఉద్రేకము చెలరేఁగి, ఒకరి నొకరు సాధించుటకు యుక్తివాదములు కోర్టులో నభియోగములు

గూడ జరిగెను. వానిని నిష్పక్షపాతముగ విశదపర్చుట కష్టసాధ్యము. 'స్వీయచరిత్రము'లో నీసూత్రములు గమనింపఁబడినవి. తమగుణములను విశిష్టచర్యలను వివరించుటతోపాటు లోపములనుగూడ వెల్లడించినారు.

ఆయన యుపాధ్యాయదశలోని బోధనవివరములు కళాశాలానుభవములు సంతగాఁ దెలుపలేదు. సంఘమందప్పుడు వీచిన ఝంఝామారుతమునకుఁ బ్రాధాన్యమిచ్చిరి; విద్యార్థులీసాంఘికకృషిలోఁ దమకు సహాయకులుగ నుండిరని తెల్పిరి. స్త్రీవిద్యావ్యాప్తికి బాల్యవివాహనివారణకు, విధవావివాహవ్యాప్తికి నేగాక, రాజమహేంద్రవరములో లంచగొండితనమును పెద్దల భేషజములను దురాచారములను వ్యభిచారాగారములను నివారించుట కాయన యెంతయో కృషి చేసెనని దీనిద్వారా వెల్లడియగుచున్నది. సంఘమునకు వ్యక్తులకుఁ గల్గుచుండు భ్రాసములు నాయన స్వాచరణముచేఁ దొలఁగింప మార్గదర్శకులై యితరులవలన నిందను దూషణను సహించి, సాహసముతో నెన్నియో కష్టములు నెదుర్కొనిరి. కష్టపరీక్షలకు నిల్చి యితరులతోఁ బోరినమీఁదటనే కార్యసాధన జరుగుచు వచ్చినది. ఎన్నియో యన్యాయమగు నపవాదములు, తీవ్రబహిష్కారము, మాన్యగుచిక్కులుండినను జంకక, దైవభక్తితో నాయన దీక్షవహించి కార్యసాధనఁ జేయుచువచ్చిరి.

ఆసందర్భమునఁ గొందఱుప్రముఖులతో నాయనకు జరిగిన సంఘర్షణమును దమకార్యదీక్షయు స్వీయచరిత్రములో స్ఫురించును; ఇందు యువకులు నేర్వఁదగిన నీతులు చాలఁ గలవు. పత్రికాసంపాదన, సాహిత్యకృషి, వాఙ్మయప్రోత్సాహము, పౌరసేవ, పురమందిరాదిస్థాపన, ఇత్యాదుల నిందువివరించినారు. సంఘసంస్కారభాగము నవలవలె మనోజ్ఞముగను వాఙ్మయరచనభాగము జ్ఞానోద్బోధకముగను నుండును. దీనిలోఁ గొందఱు ప్రతిపక్షుల విమర్శఁ జేసినను, అన్యాయపుదోషారోపణలఁ జేయలేదు. తాము కార్యవాదికాక ఖడ్గవాది నని పంతులుగారే తెల్పిరి. పరులయిష్టాదుల గమనింపక భగవంతుఁడు తోఁపించినట్లు సత్య

మునంతను ఖండితముగఁ జెల్పు నభ్యాసముగల్గి, తమచర్చలను చర్యలను గూడ దీనిలో వెల్లడించిరి. ముఖ్యాంశములనే వ్రాసినను నీగ్రంథము విపులమయినది. ద్రవ్యములేకున్నను, కష్టములు ప్రతిపక్షనిరోధము హెచ్చినను, శరీరము దుర్బలము వ్యాధిగ్రస్తము నయినను, అసహాయుఁడ యినను వీని నన్నిటిని కార్యాసక్తితోను, సంఘసేవాదీక్షతోను జయిం చినట్లిందు చదువునప్పుడు 'క్రియాసిద్ధి స్సత్త్వే భవతి మహతాం నోప కరణే, అను నార్యోక్తిపాఠకుల మనస్సునకు గోచరించును. పైనఁ జెప్పినవిగాక నీతి ధార్మిక సాంఘికాదులఁగూర్చి యాయన వ్యాసములు నుపన్యాసములును రచించిరి; చక్కనిశాస్త్రీయచర్చతోను హేతువాద ముతోను నిండి ప్రమాణవచనములతో నొప్పుచు నివి జ్ఞానభాండారము లుగ వెలయుచున్నవి.

## భాషాసేవ.

గ్రంథరచనమునఁగాక యితరవిధములను వీరేశలింగముగారాంధ్ర భాషకు సేవఁజేసిరి. అందుముఖ్యము అముద్రితమగు పూర్వకావ్యముల ప్రచురణ. ఈకాలమందువలె గ్రంథములకే వాఁడుక హెచ్చు. మహాప్ర బంధములప్పటి కచ్చుపడలేదు; పడినవియు కొన్నితప్పులతడకలుగ నుం డెను. వానితాళపత్రప్రతులను వ్రాఁతకాకితప్రతులను వెదకి సంపా దించి, పాఠభేదములను పరిశోధించి, సరిచూచి, ఆయన ముఖ్యగ్రంథ ములను వ్యయప్రయాసల కోర్చి ముద్రించి ప్రచురించెను; సంశోధించు టేగాక, ఆకవులస్థలకాలాదులఁగూర్చి కావ్యస్వరూపమునుగూర్చి జ్ఞానము గల్గించు మంచియుపోద్ఘాతములను వ్రాసెను. ఈరీతిగ, నాచనసోముని యుత్తరహరివంశము, మొల్లరామాయణము, సూరనప్రభావతీ ప్రద్యు మ్నము, రామభద్రకవి రామాభ్యుదయము, శంకరకవి హరిశ్చంద్రో పాఖ్యానము, పినవీరభద్రకవి జైమినీభారతము, కేతనవిజ్ఞానేశ్వరము, దశకుమారచరిత్రము, భోజరాజీయము, ఇట్టిమహాకావ్యముల నాయన మొదటిసారి చక్కఁగ ముద్రించిరి. మాతృకలలోని లేఖనదోషముల

సవరణ కరుదగు వ్రాతప్రతులను భాండాగారములనుండి సంపాదించి వానిని పోల్చి పదనిర్ణయముచేయుటకును, ఆయన చాల శ్రమపడి, తనబుద్ధికుశలత నుపయోగించి కృషిచేసెను.

అప్పటికాంధ్రమున నచ్చుకూటము లరుదుగనుండెను; రాజమహేంద్రపురిలోను మద్రాసులోను స్వకీయముద్రణాలయమును స్థాపించి నడుపుట యవసరమయినది. తమపుస్తకముల నుపయుక్తమగు చక్కని చిత్రపటాదులతో ముద్రించుటేగాక, పూర్వప్రబంధముల ముద్రణకు పత్త్రికల ప్రచురణకును వానిని వినియోగించెను.

ఆయన వివేకవర్ధని సత్యవాదిని మొదలగు సాంఘికపత్త్రికలను నడుపుచు, వానిద్వారా సంఘసేవతోపాటు భాషాసేవను జేయుచుండెను; అనేకగ్రంథములను విమర్శచేయుచు, యువకులకు రచనాప్రోత్సాహమిచ్చుచుండెను. సాంఘికసమస్యలఁగూర్చియు వాఙ్మయవిషయములఁగూర్చియు, ఆయన కొక్కొండ వెంకటరత్నంపంతులు, కాశీభట్ట బ్రహ్మయశాస్త్రిగార్లు మున్నగు విద్వాంసులతోఁ బత్త్రికలలో సాగించిన ద్వంద్వయుద్ధ ముభయపక్షముల ప్రతిభను వెల్లడిచేయుచుండెను. ఆంధ్రములో—ముఖ్యముగ నచ్చతెలుఁగులో—వీరేశలింగముగారి పాండిత్యమపారమని యందఱికిని తెలిసినదే. కాని సంస్కృతవాఙ్మయమం దాయన ప్రతిపక్షులకుఁ దీసిపోదురని కొందఱిభావము. అప్పటి ఖండనమండనవ్యాసములలోఁ గలప్రమాణవచనములచర్చనుబట్టిచూడ శాస్త్రవిమర్శలోను, ప్రమాణార్థనిర్ణయములలోను ఆయన యెంత మాత్రమును ప్రతిపక్షులకుఁ దీసిపోలే దని చూడఁగలము.

ఆంధ్రసాహిత్యపరిషత్ స్థాపనకును పంతులుగారు కృషిచేసిరి. దేశీయవాఙ్మయములోఁ జలనము రాఁగనే వంగీయసాహిత్యపరిషత్తు స్థాపితమయినది. అంతట తక్కినప్రాంతములలోను చలన మేర్పడి హిందీసాహిత్యసమ్మేళనాదు లేర్పడినవి. ఈలోఁగా ఆంధ్రసాహిత్యవృద్ధికి నిట్టి సంఘమావశ్యక మని గ్రహించి,ఆంధ్రసాహిత్యపరిషత్తును స్థాపించుట కాయన

యత్నించి, మిత్రులను బ్రోత్సహించిరి. 1911 సం॥లో పరిషత్తు ఏర్పడినది; ఆయన దాని స్థాపకసభ్యులలో నొకరు. ఆ సంవత్సరములో మద్రాసులో జరిగిన పరిషత్తువార్షికసభ కాయన, యధ్యక్షులగు శ్రీ పిఠాపురరాజావారి స్థానే కార్యక్రమమును జతురతతో సాగించి, ప్రముఖజనులకు దానియం దుత్సాహము గలిగించిరి. అప్పటికున్న యాంధ్రనిఘంటువు లన్నియు లోపములతో నున్నవని కనిపెట్టి యాయన సమగ్రమగు నాంధ్ర నిఘంటువును పరిషత్తువారు త్వరలో నిర్మించవలెనని ప్రశంసించి యుదారులగు శ్రీమంతులదృష్టి నావైపు కాకర్షించిరి. పంతులుగారిపైన విశేషగౌరవముగల శ్రీ పిఠాపురమహారాజాగారు కోరికను నెరవేర్పింప సమకట్టి సాహిత్యపరిషత్తువారు దానిని తయారుచేసి ప్రచురించుట కగు యావత్తుఖర్చును భరింప సహజౌదార్యముతో నిశ్చయించి సాగించుచున్నారు. ఇట్టినిఘంటువు కావాహన తమనుండి వచ్చినను, తక్కినపనుల తొందఱవలన, వ్యాధివార్ధకాది కష్టములవలనను వీరేశలింగముగారు దానినిర్మాణములో విశేషముగఁ బాల్గొనలేకపోయిరి.

## శైలి.

వీరేశలింగముగారి భాషాశైలినిగూర్చి యింకను కొంత గమనించవలసియున్నది. మఱికొందఱు పెద్దలలోవలె నాయన సాంఘికభావములతోపాటు, శైలిలోను గొంతకాలమునకు మార్పుకలిగినది. ప్రారంభదశలో నాయన పండితసంప్రదాయ నవలంబించెను. భారతరామాయణాది పూర్వగాథల నితివృత్తముగఁ జేకొని, ప్రౌఢశైలిలోఁ బద్యకావ్యముల రచించెను. గద్యమందే గాని పద్యకావ్యరచనలో నాయనకు ప్రజ్ఞ లేదనుకొందఱిభావము భ్రమజనితము. ఆశుకవిత్వరచనను సాగించియుండిన, పద్యరచన నింకను వృద్ధిచేసియుందురు. (శ్రీ తిరుపతి వెంకటేశ్వరకవులు మాత్ర మాశుకవులుగ స్థిరవాఙ్మయము సృజించిరి.) పద్యరచనలో వీరేశలింగముగా రచ్చతెలుఁగుశైలి కెక్కువ ప్రాముఖ్య

మిచ్చిరి; అందాయన పాండిత్య మపారము. శుద్ధాంధ్రగ్రంథముల నీకాలపుఁ దెలుఁగువారికి రంజకముగ వ్రాయుట చాలఁ గష్టము. అందుకుఁదోడు నైషధములో నిరోష్ఠ్యనిర్వచననియమము గూడఁ బెట్టుకొనిరి. ఈకాలమం దాంధ్రములో సంస్కృతపదములవాడుక (హిందూస్థానీపదములును) చాల హెచ్చు. కాని ఆరంభస్థితి యెట్టిదో !

తత్సమములను జేర్చుట కావ్య భాషాపరిశుద్ధికి భంగకరమను భావము తమిళసంప్రదాయములోఁ గొంతకాలముండెను. దానివలె నాంధ్రభాషయునసలు ద్రావిడకుటుంబపుదే; పూర్వపుఁ దమిళవాఙ్మయము వలె, ప్రప్రథమపుఁ దెలుఁగురచన లచ్చతెలుఁగున నేరచింపఁబడినవేమో! ఇప్పుడున్నవానిలో నతిప్రాచీనమగు మహాభారతాదులలోను సంస్కృతపదముల బాహుళ్యము కలదు. అచ్చతెలుఁగున కావ్యములరచించుట విశిష్టమని కొందఱు పూర్వకవులు భావించి శుద్ధాంధ్రరచనలఁ జేసిరి. కాని, తమిళప్రాంతముకన్న తెలుగునాడు ప్రాకృతభాషికప్రాంతములకు భౌతికముగ సన్నిహితము; మఱియు మౌర్యచాళుక్యాదులపాలనలో నుభయులకు సంస్కృతిసమన్వయమును హెచ్చి, జనులలోను సంస్కృతపదములవాడుక హెచ్చినది. కనుకఁ గొన్ని ద్రావిడపదములకన్నఁ దద్భవములకన్న సంస్కృతపదములే చదువరులకు బాగుగఁ దెలియుస్థితి యాంధ్రప్రాంతమందు చాలశతాబ్దులనుండి యేర్పడినది. అట్టిస్థితిలో శుద్ధాంధ్రకావ్యము కవికెంతటిపేరు తెచ్చినను పాఠకులలో నట్టిగ్రంథములవాడుక తగ్గుట సహజము. నిరోష్ఠ్యాదినియమములు నిట్టివే. కనుక, అచ్చతెలుఁగు కావ్యములు శుద్ధాంధ్రమున శ్రీవీరేశలింగముగారికిఁగల యఖండప్రజ్ఞను దెల్పును. కాని యానియమములేకుండ రచించియుండిన నాగ్రంథములింకను హెచ్చుగ జనాదరమునొంది లోకోపకారము గలిగించి యుండును.

అచ్చతెలుఁగులో శృంగారరసప్రధానముగ సాంప్రదాయికవర్ణనలతో చిత్రశబ్దాలంకారములతో వ్రాసి పండితాదరమును బొందఁజూచినందున, వీరాకావ్యములను ప్రౌఢశైలి నేరచించిరి. కాని వీరైనంతవఱకుఁ

గ్లిష్టతవదలి మంచిశయ్యతో మృదుమధురమగు పద్యముల నప్పుడును వ్రాయనేర్చి రని యాగ్రంథములలోను నిదర్శనములుకలవు. అప్పటి యాయనశైలిని జూపుట కీక్రిందఁగొన్నిపద్యము లుదాహరింపఁబడినవి.†

---

† చ. చిఱిఁగిన చీఱఁ గట్టుకొని చెక్కులు కన్నులకాటుకంటి డాల్
తఱిగి చెదంగ నేఁడు కడుదాఁకి యొడల్ కసుగంద నొంటి నె
న్నఱి చెరలాడనేల నిను నాదట నేలెదు నాతఁ డేఁడు నీ
తెఱఁగుఁగొఱంత యించు కఁక దేటగ నంతయు నాన తీఁదగున్.

(శుద్ధాంధ్ర నిరోష్ఠ్యనైషధము)

ఉ. కన్నులఁ జిన్నవెన్నెల లనంగ నిగుడ్చుకొని కన్నుల నొత్తి మన్ననల్
గ్రొన్నన యన్నుమిన్న నెఱిగొప్పున నప్పుడ నేలవేల్పు గ
న్నన్నలఁ దాల్చె నందలి సుగంధముఁ బొందఁగఁ జాలుకేల్గవం
దిన్నని మోడ్చె లోఁ దనిపితీఱని సొంపిమి మేరమీఱఁగన్॥

చ. పలుకులకేల నీపనుపు పన్నుగఁ జేసెద నెన్నఁడైన నీ
పలుకుల కడ్డమాడుదునె పట్టినొసంగెద చెప్పి పోయి యా
పొలఁతుక కిన్నరేఁద్రికపు నిచ్చుటలాగము మేలు నెంచి నీ
కెలిమి నిఁకేమి యిచ్చినను నించుకయేనియు నప్పుడీఱునే

(రసికజనమనోరంజనము)

ఆ. నేలవేల్పు మొసవు నిముసంబులోఁ దెచ్చి యిచ్చి పుడమిలోని యేళ్ళఁ గ్రుంక,
వెడలి యొక్కనాఁడు వినెన్నెటిలో మున్గి యొగ్గుతఱిని వెల్వనున్న తఱిని

(శుద్ధాంధ్రభారతసంగ్రహము.)

వీరేశలింగముగారు సంస్కృతదీర్ఘసమాసభరితమగు కవిత్వమువ్రాయ శక్తి లేక యిరువారు సులభశైలి నవలంబించిరని కొందఱుపండితు లాక్షేపించుటకలదు. కాని యిందులోను కొంతభ్రమ కలదు. ఆయన సమకాలికులగు కొక్కొండ వెంకటరత్నము, వెంకటరాయశాస్త్రి, వ్యాసమూర్తిశాస్త్రి, బ్రహ్మయశాస్త్రిగారలవలె బాల్యమందు దీక్షతో సంస్కృత వాఙ్మయము నభ్యసింపనందున సంస్కృత పాండిత్యమున వారికి వీరేశలింగముగారు తీసిపోవచ్చు; కాని, యుద్ధాదిరంగములందు వీరరసఘట్టము వచ్చినప్పుడు వీరేశలింగముగారును సంస్కృతదీర్ఘసమాసముల నుపయోగించినారు.

(మఱియు శ్రుతిస్మృతి శాస్త్ర చర్చలోను సనాతనపండితులతో సమానముగ నాయన యొంటిగఁ బోరఁగల్గిరి.)

మొదటి ప్రౌఢశైలినిమాని వేసి వీరేశలింగముగారు తమతరువాతిరచనల నందఱికిని సుబోధమగు శైలిలోనే వ్రాసిరి; అవి మృదువై కైశికీవృత్తిలో ద్రాక్షాపాకములో వైదర్భీరీతినున్నవి. వీరైనంతవఱకు వాడుకలోనుండు మృదుపదములనే వాడుచు నన్వయకాఠిన్యము లేకుండ వెంటనే భావము స్ఫురించునట్లాయన వ్రాయఁజొచ్చెను.* (విషయములో స్త్రీ యవయవవర్ణనమును శృంగారగాథలను మాని, నీతికిసంస్కరణకుఁ బ్రేరణ మిచ్చిరి.)

ఆంధ్రసాహిత్యమునకిది క్రొత్తయనియు, దానివలన శైలికిఁ జప్పదనముగల్గుననియు, కవిప్రజ్ఞ తెలియదనియు, కొందఱిట్టిశైలికి వ్యతిరేకు

---

*శా. అచ్చో ప్పంతియుఁ జూచి కృష్ణుఁ డెదలో నారాటముం జెంది వి
వ్వచ్చుం డెంతయు నొచ్చియుంట నొగలన్ సర్వాంపుఁ బగ్గంబులన్
మెచ్చ ల్గుల్కఁగ గట్టితేఱ డిగి యామిన్నేటిపట్టం బొరిం
బుచ్చం గా నడతెంచెఁ గేల నలితంపుంజుట్టు వాలొప్పఁగన్ (శు 1 ఘా)

చ. ఎఱుఁగుదు రక్కసు ల్నలుగు రిచ్చిన మెప్పుల నొప్పమీఱి పల్
తెఱఁగుల మిమ్ము నొంచుటయుఁ దీఱని యాఱడి కోర్వలేక యం
దఱు మలవిల్తుగోల్పుటయు నగ్గన నాతఁడు మిమ్ముఁ బుచ్చుటే
నెఱుఁగుదు వేల్పులార యనుఁ డిండ్లకు వారలరూపు మాపెదన్.
(శు॥ ఉత్తరరామాయణము)

ఉ. ఏసరు పాండవాంబునిధి నీఁగుట దుర్భర మయ్యె నేని దు
శ్శాసనవాయుసంగతిని శాంతనవాది సునావికేంద్ర రా
ధాసుతకర్ణధారసహితంబగు కౌరవరాజపోతము
ల్లాసముతోడ వచ్చి మనలన్ సరగం దరిఁ జేర్పకుండునే
(దక్షిణగోగ్రహణము.)

భీతికర కపాతమునిజముగ లేని యాధ్యాత్మికయుద్ధము వర్ణించు ప్రబోధచంద్రోదయములో నీక్రిందిరీతిపద్య ముండుట విచిత్రము.

ఉ. ఈనిశితోగ్రఖడ్గవినికృత్తభపద్గళనాళికోచ్చల
త్ఫేనిల బుద్బుదౌఘయుతభీకరశోణితభూరిధారలన్
నే నిదె తృప్తిచేసెద వినిశ్చలభక్తిని దుర్గకిప్డు క్రీ
డానినదోల్లసడ్డమరుఢాంకరణాగతభూతవర్గకున్.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు.

వృషనామసంవత్సర కార్యనివేదిక.

## ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతిసూర్యారావుబహద్దరువారు
పిఠాపురంమహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద బ్రహ్మశ్రీ కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిళాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్.

వింజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డిసూర్యనారాయణమూర్తినాయుఁడుగారు (కోశాధ్యక్షులు)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కోకా శివనాథశాస్త్రిగారు.

నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

అశక్కి వెంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

పిల్లారిశెట్టి రంగబ్రహ్మరావునాయుఁడుగారు.

ప్రతివాదిభయంకరం పార్థసారథిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

పరిషత్కార్యాలయమున బ్రహ్మశ్రీ సాహిత్యవిద్యాప్రవీణ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు మేనేజరుగా పనిచేయుచున్నారు.

ఈ వృషసంవత్సరముతో నాంధ్రసాహిత్యపరిషత్తునకు ముప్పది సంవత్సరములు గడచినవి. ప్రాచ్య పాశ్చాత్యప్రపంచములు ఘోరసంగ్రామమువలనను, యార్థికపరిస్థితులవలన నల్లకల్లోలముగ నున్నవి. అయినను పరిషత్తు పూర్వమువలె భాషాసేవ నొనర్చుచుఁ బత్రికాప్రకటనమును గ్రంథప్రకటనమును జరుపుచున్నది. పరిషత్ప్రతిష్ఠాపనము

మొదలు స్వభాషాభిమానముచేఁ బరిషత్తునకుఁ బలురీతుల సహాయమొనరించి వృద్ధికిఁదెచ్చిన మహనీయులకును పండితులకును పరిషత్తు తన కృతజ్ఞతాభివందనముల నొసఁగుచున్నది. పరిషత్ప్రతిష్ఠాపకులలో ముఖ్యులై తమ యావజ్జీవము తత్కార్యనిర్వహణ మొనర్చి కృతకృత్యులైన బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగారు కీర్తిశేషులగుటచేఁ బరిషత్తునకు దీరని లోటు వాటిల్లినది. వారి స్థానమున నేఁడు సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రివర్యు లధ్యక్షులుగ నుండి పరిషత్కార్య నిర్వహణ మొనర్చుచున్నారు. వీరు శ్రీ పీఠికాపుర మహారాజావారిచే నిఘంటు కార్యాలయాధ్యక్షులుగఁగూడ నియమింపఁబడి యున్నారు. వీరి సంపాదకత్వమున శ్రీ సూర్యరాయనిఘంటువు తృతీయసంపుటము ముద్రింపఁబడియున్నది. మిగిలినసంపుటములును ద్వరలో వెలువడి గ్రంథము పూర్తియగునని తెలుపుచున్నాము. నేఁటి విషమపరిస్థితులయందును దమ భాషాభిమానమును వీడక నిఘంటుకార్యముల నిర్విఘ్నముగఁ గొనసాగింపుచున్న మన యావజ్జీవాధ్యక్షులు శ్రీ శ్రీ పీఠికాపురమహారాజావారికి పరిషత్తువారేగాక నిఖిలాంధ్రలోకమును దమ కృతజ్ఞతను వెల్లడింపవలసి యున్నది.

సభ్యులు-చందాదారులు :— ఈ సంవత్సరమున సభ్యులు 34 చందాదారులు 65 కలరు. వీరిసంఖ్య వృద్ధియగుటకు వలయు ప్రయత్నమున సభ్యులును చందాదారులును మాకుఁ దోడ్పడవలసి యున్నది. ఈసందర్భమునఁ బూర్వపునిబంధనలలో సభ్యులకును చందాదారులకును గల భేదమును దీసివేయుట మంచిదని మావిజ్ఞప్తి.

ఆయవ్యయములు :— ఆయవ్యయపట్టిక యిందుల కనుబంధముగ నొసంగఁబడినది. దీనివలన మన యాదాయము పరిషత్కార్యనిర్వహణమునకు సరిపడుటలేదని స్పష్టము. భాషాభిమానులును నుదారులును పత్రికకు విరాళముల నొసఁగియు జందాదారులుగనుండియు బరిషత్ప్రకటనములఁ గొనియు దోడ్పడుదురని విశ్వసించుచున్నాము.

గ్రంథప్రకటనము:—సంవత్సరాంతముతో సాహిత్యపరిషత్పత్రిక ముప్పది సంపుటములు వెలువడినవి. యుద్ధపరిస్థితులవలనఁ గాగితము పూర్వమువలె లభింపకపోయినను నెటులనో పత్రికాముద్రణము జరగుచున్నది. నూతనగ్రంథముల ముద్రించుటకుఁ గాగితము తగినట్లు లభించుటలేదు. ఈ సంవత్సరము మంత్రిప్రగడ సూర్యప్రకాశకవికృతమగు సీతారామచరిత్రమున బాలకాండము ముద్రింపఁబడి గ్రంథరూపమునఁ బీఠికతోఁ బ్రకటింపఁబడినది. పరిషత్పుస్తక భాండాగారమున లక్షణగ్రంథముల తాళప్రతుల పరిశోధనము (ఛందోవ్యాకరణాలంకార గ్రంథములు)పూర్తియయినది. వానినిగూర్చిన ముఖ్యవిషయములు పరిషత్పుస్తకభాండాగారము—మూఁడవభాగమున దెలుపఁబడినవి. మఱియు, నిశ్శంకు కొమ్మన శివలీలావిలాసమున రెండాశ్వాసములు మాత్రమే లభించినవి. అది యుత్తమప్రబంధములలో నొక్కటి యగుటచే దానికిఁ బ్రత్యంతరము లభింపకపోయినను, ముద్రించుప్రయత్నము జరుగుచున్నది. చిత్రభానుసంవత్సర పరిషత్పత్రికలలో దాని ముద్రణము ప్రారంభింపఁబడును. లౌకికన్యాయవివరణము, చిత్రకవి పెద్దనార్యకృతమగు లక్షణసారసంగ్రహమును గ్రంథరూపమున వెలువడి విక్రయమునకు సిద్ధముగానున్నవి. పరిషద్భాండాగారమున నముద్రితములును నమూల్యములునగు గ్రంథములు జాలఁగలవు. వానికిఁ బ్రతుల వ్రాయించుటకును ముద్రించుటకును దగిన మూలధనమును సంపాదించుట ముఖ్యము. క్రిమిదష్టములుగాకుండ వానిని గాపాడి యాంధ్రలోకమున కర్పించుట మన విధ్యుక్త ధర్మము. అధునాతన వాఙ్మయప్రపంచము ప్రాచీనగ్రంథములకుఁ దగు గౌరవ మొసంగకున్నను కాలమే వాని ప్రాశస్త్యమును నిరూపింపఁగలదు.

పరిషద్భాండాగారము:—ఇందుగల తాళపత్ర ప్రతులసంఖ్య 4678 ముద్రితగ్రంథములసంఖ్య 4448. శ్రీశ్రీ బరోడా, కాశ్మీరము మహారాజా వారలు తాముప్రకటింపఁజేయుచున్న గ్రంథముల నుచితముగ నొసంగి

మన పరిషత్తును గౌరవించుచున్నారు. వారికిని వినిమయముగ తమ పత్రికలనొసంగుచున్న పత్రికాసంపాదకులకును మావందనములనొసఁగవలసియున్నది. వినిమయముగ వచ్చెడిపత్రికలసంఖ్య 42. గ్రంథాలయమునఁగల తాళపత్త్రగ్రంథముసు క్రమరీతిని బరిశోధనమొనర్చి పుస్తకభాండాగారమనుపేర (Descriptive Catalogue) గ్రంథపట్టిక తిరిగి ముద్రింపఁదలచితిమి. అందు మూఁడవభాగమున లక్షణగ్రంథముల పట్టికయు నాయాగ్రంథవిశేషములను దెలుపఁబడినవి. ప్రబంధాదులనుగూడ త్వరలోఁబరిశోధించిమిగిలినభాగములనుముద్రింతుము. వేర్వేఱుప్రతుల బరిశీలించి ముఖ్యమగుగ్రంథములకు పాఠభేదములనువ్రాయించు చున్నాము. ఆప్రకారము కావ్యాలంకారచూడామణి, విజ్ఞానేశ్వరము, పారిజాతాపహరణము మొదలగు గ్రంథములకు పాఠభేదములు వ్రాయించఁబడినవి. ఈ పాఠభేదముల సమకూర్చుటవలన ప్రాచీనభాషా సంప్రదాయాదు లెఱుంగ నగుటయేకాక వానిని ముందు బ్రకటించుటకు మిక్కిలి సహాకారిగనుండును. ఇదివరలో గ్రంథములఁబ్రకటించువారలు తమకు దోఁచినపాఠములఁగైకొని మిగిలినవి వదలుట యాచారమైనది. అట్లుగాక వారు విమర్శించిన బ్రతులను దెలుపుచు నందుగల పాఠములఁజూపుచో నవి యాంధ్రవాఙ్మయ పరిశోధనమున కత్యంతోపయోగముగ నుండును.

<u>పరిషద్భవననిర్మాణము:</u>—పరిషత్తునకుఁదగిన స్థిరవసతి లేకుండుట నరసి ధవిళేశ్వరము నివాసులును, కీ. శే. ప్రభల సుందరరామయ్యగారి ధర్మపత్నియు, విదుషీమణియునగు శ్రీమతి ప్రభల వేంకటసుబ్బమ్మగారు మహోదారభావముతో తమభర్తగారి స్మారకార్థమై వారిపేర శాశ్వతమగు భవన నిర్మాణమును జేయుటకు భూరివిరాళ మొసఁగిరి. గృహనిర్మాణమునకువలయు స్థలము కాకినాడ రామారావుపేటలో సంపాదింపఁబడి నిర్మాణసామగ్రి సమకూర్పఁబడినది. అచిరకాలముననే భగవంతుని యనుగ్రహమువలన భవననిర్మాణముపూర్తియగునని విన్నవించుచున్నాము. శ్రీ వేంకటసుబ్బమ్మగారిట్టివిరాళములనుబెక్కు సంస్థలకొసఁగియున్నారు.

ఈమె శ్రీ రామయ్యపంతులుగారి సోదరియగుటయు, భాషాభిమానముతోనిట్టి మహత్కార్యమును బూనుటయు నాంధ్రుల పుణ్యవిశేషమని చెప్పనగును. ఈమె ప్రోత్సాహమువలనను నౌదార్యమువలనను పరిషద్భవననిర్మాణము పూర్తియై యాంధ్రభాషాభిమానుల కాహ్లాదమొనరింపఁగలదని మానమ్మకము. శ్రీమతిసుబ్బమ్మగారికి మన పరిషత్పక్షమునఁ గృతజ్ఞతాభివందనముల నొసఁగుచున్నాము.

ప్రథమమునుండియు మన పరిషత్తు గ్రాంథికాంధ్రమునకే ప్రాధాన్యమొసఁగుచు వ్యావహారిక గ్రామ్యరచనముల నిరసించుట యందఱకును విదితమే. వాఙ్మయము నూతనమార్గముల నభివృద్ధినిగాంచుట పరిషద్వర్గము వారి కిష్టములేదని ప్రతిపక్షులు ప్రచారమొనర్చుచున్నారు. ఇది యసత్యము. కవిత్వాదులయందు వ్యాకరణాదిలక్షణోల్లంఘన ముచితముగాదనియు, నిరంకుశులై గ్రంథరచయితలు బహువిధముల రచనయొనర్చుచో నది భాషాభ్యుదయహేతువుగాదనియు మన యుద్దేశము. వ్యావహారికగ్రామ్యములు దేశకాలవిభాగములచే భిన్నత్వమును గాంచుటచే నవి కావ్యముల బ్రయోగింపరాదనియు, లక్షణయుతమగు భాషనే యుపయోగింపవలెననియు పరిషత్తు ప్రథమమునుండియు దెలుపుచున్నది. ఆవిషయమునుగూర్చియు, పరిషదుద్దేశములు, కార్యక్రమమును గూర్చియు నాంధ్రదేశమున విపులముగ బ్రచారమొనర్పవలసి యున్నది. అట్టి బాధ్యత సభ్యులపైనను జందాదారులపైనను గూడ కలదు.

పరిషత్కార్యనిర్వహణమున మాకుఁ దోడ్పడుచు నుత్సాహముతోఁ బనిచేయుచున్న కార్యనిర్వాహకవర్గమువారికిని నితర భాషాభిమానులకును మావందనములు.

ఇట్లు విధేయులు,

**కిళాంబి రాఘవాచార్యులు,**

**వింజమూరి వెంకన్న.**

కార్యదర్శులు.

# INCOME AND EXPENDITURE STATEMENT

| రూ. | ఆయము. | | | |
|---|---|---|---|---|
| 1. సంవత్సరాదినిలువ | ... | ... | ... | 147-11-11 |
| 2. బ్యాంకినుండి వచ్చు వడ్డీ | ... | ... | ... | 639- 2- 0 |
| 3. సాధారణసభ్యులు | ... | ... | ... | 39- 0- 0 |
| 4. పత్రికచందాదారులు | ... | ... | ... | 157- 8- 0 |
| 5. విడిసంచికల విక్రయము | ... | ... | ... | 7- 3- 9 |
| 6. ఇతర జమలు | ... | ... | ... | 76- 7- 9 |
| 7. పుస్తక విక్రయము | ... | ... | ... | 219-14- 6 |

| | | | |
|---|---|---|---|
| | | బ్రాటోవరు | 39- 2-3 |
| విప్రనారాయణచరిత్రము | 3-10-9 | సింహాసనద్వాత్రింశిక I | 10-15-6 |
| జైమినిభారతము | 10- 8-0 | సింహాసనద్వాత్రింశిక II | 2- 2-6 |
| కవిజనాశ్రయము | 7- 9-9 | నిఘంటుచరిత్రము | 0-11-3 |
| చంపూరామాయణము | 3- 4-0 | ఆంధ్రకౌముది | 0-15-0 |
| ప్రాకృతభాషోత్పత్తి | 0-12-0 | బాలభారతము | 6- 5-6 |
| శివరాత్రిమాహాత్మ్యము | 2-13-9 | చాటుధారాచమత్కారసారః | 0- 7-0 |
| ఆర్యభాషావిభాగము | 0- 7-0 | సాంబోపాఖ్యానము | 1- 0-0 |
| మన్నారుదాసవిలాసము | 0- 8-0 | రసార్ణవాలంకారము | 0- 7-0 |
| కాళిందీకన్యాపరిణయము I | 2- 7-0 | కవిజనోజ్జీవనిసమస్యలు | 0- 3-6 |
| ఆంధ్రధాతుమాల | 1- 6-0 | రజతోత్సవసంపుటము | 0-14-0 |
| శాసనపద్యమంజరి I భా | 0-12-0 | అఱవదేశమందలిఆంధ్రవాఙ్మయం | 0- 7-0 |
| శాసనపద్యమంజరి II భా | 0- 4-0 | లౌకికన్యాయవివరణము | 1- 0-0 |
| శతకసముచ్చయము I భా | 0-12-0 | లక్షణసారసంగ్రహము | 1- 8-0 |
| శతకసముచ్చయము II భా | 0-10-0 | ఉత్తరరామచరితము | 3- 2-0 |
| సూత్రాంధ్రవ్యాకరణము | 0-15-0 | సూర్యరాయాంధ్రనిఘంటువు I | 66- 0-0 |
| రసాభరణము | 0- 8-0 | సూర్యరాయాంధ్రనిఘంటువు II | 82- 0-0 |
| ఆంధ్రశబ్దచింతామణి | 1- 0-0 | చంపూరామాయణము | 0-14-0 |
| రాయవాచకము | 0-15-0 | ఆంధ్రవాఙ్మయవికాసవైఖరి | 1-12-0 |
| | 9- 2-3 | | 219-14-6 |

| | | | | |
|---|---|---|---|---|
| 8. పోస్టేజివలన | ... | ... | ... | 7- 4- 9 |
| 9. సాదరుకాతావలన | ... | ... | ... | 3- 5- 9 |
| 10. చేబదులు | ... | ... | ... | 375- 0- 0 |
| | | | | 1672-10- 5 |

## FOR THE YEAR 1941-42. వృష సంవత్సరము.

వ్యయము.

| | |
|---|---|
| బ్యాంకి చిల్లరవ్యయములు ... ... | 1- 2- 0 |
| ఇతర వ్యయములు ... ... | 22-11- 0 |
| క్రొత్తపల్లి సుబ్రహ్మణ్యముగారికి ... ... | 20- 4- 0 |
| పోష్టు వ్యయములు ... ... | 61-10- 0 |
| ఉద్యోగుల ప్రయాణవ్యయములు ... ... | 57- 9- 6 |
| ఉద్యోగుల జీతములు ... ... | 775-10- 0 |
| పత్రికకు కాగితము ... ... | 113-14- 0 |
| పత్రిక ముద్రణము ... ... | 100- 0- 0 |
| చిల్లర బైండింగు ... ... | 24- 7- 6 |
| పత్రికలకు చందాలు ... ... | 29- 0- 0 |
| గ్రంథప్రకటనము ... ... | 61-12- 0 |
| కొనిన పుస్తకములు ... ... | 23-11- 0 |
| సాదరుకాతా ... ... | 72- 7- 6 |
| చేబదుళ్లు ... ... | 275- 0- 0 |
| | 1639- 2- 6 |

| | | |
|---|---|---|
| సంవత్సరాంతమున నిలువ వివరము ... ... | | 33- 7-11 |
| ఇంపీరియలుబ్యాంకి సేవింగ్సుబ్యాంకిలో | 9-12- 7 | |
| కార్యదర్శియొద్ద | 23-11- 4 | |
| | 33- 7-11 | |

కిడాంబి రాఘవాచార్యులు,
చింతమూరి వెంకన్న,
కార్యదర్శులు.

# ఆంధ్రసాహిత్యపరిషత్తు - ప్రతిష్ఠాపకులు.

శ్రీ శ్రీ మహారాజా రావు వేంకటకుమారమహీపతి సూర్యారావుబహద్దరువారు
పిఠాపురంమహారాజావారు, పరిషద్యావజ్జీవాధ్యక్షులు.

కీ. శే. శ్రీ వేంకటగిరి మహారాజావారు.

కీ. శే. శ్రీ బొబ్బిలి మహారాజావారు.

## ఉద్ధారకులు.

శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారు-ఉయ్యూరు జమీందారువారు.

## అధ్యక్షులు.

సాహిత్యవిశారద కాశీభట్ట సుబ్బయ్యశాస్త్రిగారు.

## కార్యదర్శులు.

కిడాంబి రాఘవాచార్యులుగారు, ఎం. ఏ. బి. ఎల్.

[illegible]ంజమూరి వెంకన్నపంతులుగారు, ఎం. ఏ.

## కార్యనిర్వాహకసభాసభ్యులు.

దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తినాయుడుగారు (కోశాధ్యక్షులు)

పెద్దాడ రామస్వామిగారు, ఎం. ఏ.

చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు.

కోకా శివనాథశాస్త్రిగారు.

నిడుదవోలు వేంకటరావుగారు, ఎం. ఏ.

అళక్కి వెంకట్రామయ్యగారు.

కేశవరపు కామరాజుగారు.

పిళ్ళారిశెట్టి రంగబ్రహ్మరావునాయుడుగారు.

ప్రతివాదిభయంకరం పార్థసారధిగారు, బి. ఏ., ఎల్. ఎల్. బి.

# శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు.

## తృతీయసంపుటము.

శ్రీపిఠాపురము మహారాజావారి ధనసహాయముచే రచియింపఁబడుచున్న పెద్దనిఘంటువులోని రాయల్ సైజు 1000 పుటలుగల ప్రథమసంపుటమును, 955 పుటలుగల రెండవసంపుటమును, 980 పుటలుగల మూఁడవసంపుటమును ముద్రితములై విక్రయమునకు సిద్ధముగానున్నవి. ఇందు ప్రథమసంపుటమున అకారము మొదలు, ఔకారమువఱకును గల యచ్చు లాదియందుఁగల సంస్కృతాంధ్రశబ్దము లన్నియుఁగలవు. రెండవసంపుటమున 'క' మొదలు 'ఙ' వఱకుఁగల శబ్దములును, తృతీయసంపుటమున 'చ' మొదలు 'త్స' వఱకుఁగల శబ్దములునుగలవు. ఇదివఱకున్న నిఘంటువు లన్నిటికంటె నిది సర్వవిధముల నుత్తమ మయినది. ఈభాగములు శబ్దరత్నాకరములో 500 పుటలలో మాత్రమే యిమిడినవి. ఈనిఘంటువునందు, సంస్కృతశబ్దములు పూర్వనిఘంటువు లన్నిటియందుకంటె మిక్కిలి యధికముగా నీయఁబడినవి. కావున సంస్కృతవిద్యార్థులకుఁ గూడ మిగుల నుపయోగకరముగా నుండును. ఆచ్ఛికపదములకుఁగల యర్థభేదములు గనఁబఱిచి వానికిఁ బ్రమాణవాక్యములు పూర్వగ్రంథములనుండి విపులముగా నీయఁబడినవి. లభ్యమైనంతవఱకుఁ దెనుఁగుశబ్దములకు సంస్కృతప్రాకృతద్రావిడాదిభాషలయందుఁగల సజాతీయ పదములు చూపఁబడినవి. కేవలము విడిశబ్దములే గాక సందర్భానుసారముగ సమస్తపదములు (Phrases) ను వానికిఁ గల యర్థములును ప్రయోగములును గూడ నీయఁబడినవి. జనకశబ్దముల క్రింద జన్యశబ్దములు చూపఁబడినవి. ఇది విద్యార్థులకు సహకారి. ఈపుస్తకమును రచియించుటకు ముద్రించుటకు విశేషద్రవ్యముపట్టినను ధనవంతులకేగాక జనసామాన్యమునకుఁ గూడ లభ్యముగా నుండవలయునను తలంపుతో నీక్రిందివెలలు నిర్ణయింపఁబడినవి. ప్రథమసంపుటము సాదాప్రతి వెల రు 5 లు, మేలుప్రతి (Art Paper) రు. 7 లు, ద్వితీయసంపుటము సాదాప్రతి రు. 4 లు, మేలుప్రతి రు. 5 లు, తృతీయసంపుటము సాదాప్రతి రు. 4 లు, మేలుప్రతి రు. 5 లు.

---

Printed by N. Achutaramaih at the Cocanada Printing Works, Cocanada, and Published by K. Raghavacharyulu, Secretary, Telugu Academy, Cocanada.